# సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ బహిరంగ లేఖ



పార్టీ సంస్థలకు, సోవియట్ దేశ
కమ్యూనిస్టులకు






సోవియట్ భూమి
పుస్తకాలు

మద్రాసు
నవంబరు, 1963

# సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ బహిరంగ లేఖ

పార్టీ సంస్థలకు, సోవియట్ దేశ కమ్యూనిస్టులకు




సోవియట్ భూమి పుస్తకాలు

మద్రాసు
నవంబరు, 1963

ప్రియమైన కామ్రేడ్స్,

ఒకొక్క బహిరంగలేఖ వ్రాయవలసిన అవసరం ఏర్పడ్డదని సోవియట్ దేశ కమ్యూనిస్ట్ పార్టీ కేంద్రకమిటీ అభిప్రాయపడుతున్నది. 1963 జూన్ 14 న చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ వ్రాసిన లేఖ దృష్ట్యా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని ముఖ్య సమస్యలపై తన వైఖరిని తెలియజేయవలెనని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ అభిప్రాయపడుతున్నది.

సోవియట్ ప్రజలందరి అభీష్టాలకు అనుగుణంగా. అన్ని సోషలిస్టు దేశాల ప్రజలతోను, చైనా ప్రజలతోను సౌహార్ద స్నేహ సంబంధాలు పెంపు చేసుకోవటానికి మన పార్టీ, ప్రభుత్వము సర్వ శక్తులా కృషిచేస్తున్నవి. ఈ విషయం సోవియట్ ప్రజలందరికీ తెలుసు. కమ్యూనిజం విజయం పొందాలనే సామాన్య లక్ష్యం, ఒకే విధమైన ఆశలు, ఆశయాలు మనలనందరిన్నీ ఐక్యం చేస్తున్నాయి.

చాలా ఏండ్లవరకూ మన పార్టీల మధ్య సంబంధాలు బాగానే ఉన్నాయి. కాని, కొంతకాలం క్రితం చైనా కమ్యూనిస్టుపార్టీకి, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, తదితర సోషలిస్టు పార్టీలకూ మధ్య తీవ్రమైన విభేదాలున్నట్లు వెల్లడి కాసాగింది.

చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకుల ప్రస్తుత ప్రకటనలపట్ల, చర్యలపట్ల సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ చాలా ఆందోళన వ్యక్తం చేస్తున్నది. ఈ ప్రకటనలు, చర్యలు మన పార్టీల మధ్యగల ఐక్యతను, స్నేహాన్ని ధ్వంసం చేస్తున్నాయి.

వెల్లడైన విభేదాలను పరిష్కరించుకునేందుకు, తనకు తానై చేయవలసిన కృషిని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సాగిస్తూనే ఉంది. ఈ సంవత్సరం జనవరిలో ఒక ప్రతిపాదనచేసింది. కమ్యూనిస్టు ఉద్యమంలో ఏర్పడిన విభేదాలను గురించి బహిరంగ వాగ్వాదాలు మానివేయాలనీ, అలా జరిగితే వివాదగ్రస్తమైన అంశాలపై ప్రశాంతంగా వ్యవహార

సరళిలో చర్యలు జరుపుకోవడం సాధ్యమనీ, మార్క్సిస్టు, లెనినిస్టు పునాదుల ప్రాతిపదికపై విభేదాలను పరిష్కరించుకోవచ్చుననీ ప్రతిపాదించింది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చేసిన ఈ ప్రతిపాదన అన్నిసోదర పార్టీల ఆమోదాన్ని పొందింది.

ఆ పిమ్మట, సోవియట్, చైనా కమ్యూనిస్టు పార్టీల ప్రతినిధుల మధ్య, ఒక అంగీకారం కుదిరింది. ఆ అంగీకారానికి అనుగుణంగానే మాస్కోలో ప్రస్తుత చర్చలు జరుగుతున్నాయి.

చైనా కామ్రేడ్సుకూడా మనవలెనే సద్భావాన్ని ప్రదర్శించి, సమావేశం జయప్రదం కావడానికి తోడ్పడతారని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ఆశించింది. మన ప్రజల శ్రేయస్సు దృష్ట్యా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ శ్రేయస్సు దృష్ట్యా అలా చేస్తారని ఆశించాము. కాని అలా జరగలేదు. ఇది మాకెంతో విచారం కలిగించింది. సోవియట్, చైనా కమ్యూనిస్టు పార్టీల మధ్య మాస్కోలో చర్చలు జరగాలని అంగీకారం కుదిరిన మీదట, సమావేశం తేదీ, పాల్గొనవలసిన ప్రతినిధులు నిర్ణయమైన తర్వాత, చైనావారు తమ విభేదాలనన్నింటినీ సమావేశంలో చర్చకు వదలిపెట్టవలసింది పోయి, అనుకోని విధంగా ప్రపంచం అంతటికీ, ఆ విభేదాలను ప్రచారం చేయసాగారు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ మీద, ఇతర సోదర పార్టీలమీద కొత్త ఆరోపణలు చేయసాగారు.

ఈ సంవత్సరం జూన్ 14 న చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రచురించిన ఒక లేఖలో ఈ విషయం వ్యక్తమైంది. కమ్యూనిస్టు, కార్మిక పార్టీల మాస్కో సమావేశాలు ఆమోదించిన ప్రకటనలకు ఈ లేఖలో చైనావారు తమకు తోచిన వ్యాఖ్యానం ఇచ్చారు. చరిత్రాత్మకమైన ఆ ప్రకటనలలోని మూలసూత్రాలకు వక్రభాష్యం చెప్పారు. మన పార్టీమీద, ఇతర కమ్యూనిస్టు పార్టీలమీద, ఇరవై, ఇరవై యొకటి, ఇరవై రెండో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ మహాసభలమీద, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం మీదా నిరాధారమైన నిందారోపణలు చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రకటించిన లేఖలో ఉన్నాయి.

జూన్ 14న చైనా పార్టీ లేఖను అధ్యయనం చేసిన మీదట, సోవియట్ పత్రికలలో ఆ లేఖను ఆనాడు ప్రచురించటం అనుచితమని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ అధ్యక్షవర్గం నిర్ణయానికి వచ్చింది ఈ విషయం, జూన్ 19న 'ప్రావదా.' పత్రికలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ చేసిన ప్రకటన ద్వారా మీకు తెలుసు. ఆ లేఖను ప్రచురించటమంటే, మనం దానికొక బహిరంగ సమాధానాన్ని కూడా ఇవ్వవలసి ఉంటుంది. అలా చేయటం ద్వారా వివాదాలు మరింత తీవ్రమయ్యేవి. ఆవేశాలు పెరిగేవి. తద్వారా ఉభయపార్టీల మధ్య సంబంధాలు మరింత చెడిపోయి ఉండేవి.

ఉభయ పార్టీల ప్రతినిధులకు త్వరలో సమావేశం జరగనున్న సమయంలో, అలా ప్రచురించటం మరింత హానికరంగా ఉండేదని మా అభిప్రాయం. ప్రపంచ ప్రగతిని గురించిన ముఖ్య సమస్యలపైన, కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధుల సమావేశాన్ని జరిపేందుకు అనుకూల వాతావరణం కల్పించే సమస్యలపైనా, ఉభయ పార్టీలకు గల అభిప్రాయభేదాలను సౌహార్ద భావంతో, సమగ్ర పరిశీలన ద్వారా పరస్పరం అర్థంచేసుకొనటం ఈ సమావేశం ఉద్దేశమని మేమనుకుంటున్నాం.

ఇదే సమయంలో చైనా కమ్యూనిస్టు పార్టీ వ్రాసిన ఉత్తరం విషయమై సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ సభ్యులకు, విస్తృత సమావేశానికి హాజరైన ఇతరులకు తెలియజేయటం అవసరమని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ అభిప్రాయపడ్డది. కనుక చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానికి, సోవియట్, తదితర మార్క్సిస్టు, లెనినిస్టు పార్టీల నాయకత్వాలకుగల విభేదాల సారాంశాన్ని వారికి తెలియ చేసింది.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ అధ్యక్షవర్గం సాగించిన రాజకీయ కార్యక్రమాన్ని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ప్రథమ కార్యదర్శి, ప్రధాన మంత్రి ఐన ఎన్. ఎస్. క్రుశ్చేవ్ సాగించిన కార్యక్రమాన్ని కేంద్రకమిటీ విస్తృత సమావేశం ఏకగ్రీవంగా ఆమోదించింది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని సంఘటితం చేయడానికి యీ కార్యక్రమం ఉద్దేశించబడింది. చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీతో సోవి

యట్ కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షవర్గం వ్యవహరించిన తీరును విస్తృత కేంద్రకమిటీ ఏకగ్రీవంగా ఆమోదించింది.

చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధులతో చర్చలు జరిపేటప్పుడు 20, 21, 22 పార్టీ మహాసభల విధానాలను తుచ తప్పకుండా అనుసరించవలసిందిగా కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షవర్గానికి కేంద్రకమిటీ విస్తృత సమావేశం ఆదేశమిచ్చింది. ఇరవై, ఇరవై ఒకటి, ఇరవై రెండు పార్టీ మహాసభల విధానాలను ప్రపంచ కమ్యూనిస్టు, కార్మిక పార్టీలు ఆమోదించాయి. ఆ విధానాలు సరైనవని అంతర్జాతీయ పరిణామాలు, జీవిత గమనమూ నిరూపించాయి.

మన పార్టీపైన, ఇతర కమ్యూనిస్టు పార్టీలపైన చైనా కమ్యూనిస్టు పార్టీ చేసిన నిరాధారమైన నిందారోపణలను కేంద్రకమిటీ విస్తృత సమావేశం ఖచ్చితంగా తోసిపుచ్చింది. 20, 21, 22 పార్టీ కాంగ్రెసుల నిర్ణయాలపైన, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమంపైన చేసిన నిందారోపణలను ఖచ్చితంగా తోసిపుచ్చింది. యావత్ పార్టీయొక్క దృఢనిశ్చయాన్ని వ్యక్తం చేస్తూ కేంద్రకమిటీ విస్తృత సమావేశం అంతర్జాతీయ సోదర పార్టీలను సమీకరించాలనే, ప్రస్తుత విభేదాలను అధిగమించాలనే దృఢసంకల్పాన్ని వ్యక్తం చేసింది.

మార్క్సిజం, లెనినిజం పునాదులపైన, సోషలిస్టు అంతర్జాతీయత పైన ఆధారపడి, చైనా, సోవియట్ కమ్యూనిస్టు పార్టీల మధ్య స్నేహ బంధాలను వృద్ధిచేసే కార్యక్రమాన్ని, మన పార్టీ ఇక ముందు కూడా కొనసాగిస్తూనే ఉంటుందని విస్తృత సమావేశం తీర్మానించింది. ఉమ్మడి లక్ష్యం విజయం పొందేందుకు ఈ స్నేహ సంబంధాలు అత్యవసరం.

మన నిగ్రహాన్ని చైనా సోదరులు తమకు తోచిన విధంగా వ్యాఖ్యానిస్తున్నారని ఇటీవలి ఘటనలు నిరూపించాయి. ఇది చాలా దురదృష్టకరం. కమ్యూనిస్టు ఉద్యమంలో విభేదాలు తీవ్రతరం కారాదు అని మనం మనస్ఫూర్తిగా చేస్తున్న ప్రయత్నాలను, సోవియట్ ప్రజలకు, కమ్యూనిస్టులకు చైనా నాయకుల అభిప్రాయాలు తెలియనియ్యకుండా దాచిపెట్టే యత్నాలుగా, వారు భావిస్తున్నారు. మన నిగ్రహాన్ని చైనా సోదరులు బలహీనంగా అర్థం చేసుకున్నారు; సోషలిస్టు దేశాల మధ్య ఉండవలసిన స్నేహ సంబంధాలను ఉల్లంఘించి, అసందర్భంగా, మిలి

మీరిన మొండితనంతో జూన్ 14 చైనా కమ్యూనిస్టు పార్టీ లేఖను, రష్యన్ భాషలో ఎక్కువ సంఖ్యలో ప్రతులను అచ్చువేసి, చట్ట వ్యతిరేకంగా మాస్కోలోనూ, తదితర సోవియట్ నగరాలలోనూ పంచిపెట్ట సాగారు.

అంతటితో వారు తృప్తిపడలేదు. ఈ లేఖను, మన పార్టీకి వ్యతిరేకంగా ఉద్దేశించబడిన ఇతర పత్రాలను చైనావారు దుర్బుద్ధితో ప్రపంచమంతటా వ్యాప్తిచేయసాగారు. ఇలా వ్యాపింప చేయటానికి వారు సామ్రాజ్యవాదుల ప్రచురణాలయాలను, వారి పంపకం యంత్రాంగాన్ని వాడుకోటానికి కూడా సందేహించలేదు.

ఇలాంటి చర్యలు కూడదని సోవియట్ దేశంలోని చైనా రాయబారికి సోవియట్ విదేశాంగశాఖ తెలియజేసింది. ఈ చర్యలు మన సార్వభౌమత్వాన్ని దారుణంగా ఉల్లంఘించే చర్యలని చెప్పడం జరిగింది. కాని, చైనా ప్రతినిధులు తమ కార్యక్రమాలను మానుకోకపోగా, ఈ లేఖను సోవియట్ దేశంలో ప్రచారం చేయటం తమ హక్కు అనట్లు వారు అట్టహాసం చేయసాగారు. దీంతో పరిస్థితులు చాలా విషమించాయి.

సోవియట్, చైనా పార్టీల చర్చలు మాస్కోలో మొదలైన మీదట, జూలై 7న పెకింగ్‌లో ఒక బహిరంగ సభ జరిగింది. సోవియట్ దేశం నుండి బహిష్కృతులైన చైనీయులకు, వీరులవలె చైనా అధికారులు ఆ సభలో సన్మానం చేశారు. మన పార్టీపైన, సోవియట్ ప్రభుత్వంపైన దాడులు చేసే పత్రాలను చట్టవిరుద్ధంగా పంచిన వ్యక్తులకు పై సన్మానం జరిగింది. ఈ చైనా ఉద్యోగులు ఆ సభలో మాట్లాడుతూ, సోవియట్ దేశంపట్ల ఈ అమిత్రభావాలను చైనా ప్రజలలో రెచ్చగొట్ట యత్నించారు. మన దేశ సార్వభౌమత్వాన్ని, అంతర్జాతీయ నియమ నిబంధనలను ఉల్లంఘించటం తమకు హక్కు అని వారు ప్రసంగాలు చేశారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ జూలై 10న మరొక ప్రకటన చేస్తూ పై చర్యలను సమర్థించింది. అంటే సోవియట్ దేశ ఆంతరంగిక విషయాలలో జోక్యం చేసుకునే హక్కు తమకున్నదని వారి అభిప్రాయమన్న మాట. సహజంగానే ఇట్టి జోక్యాన్ని సోవియట్ ప్రభుత్వం ఎప్పటికీ

సహించదు. ఇట్టి చర్యలద్వారా సత్సంబంధాలు మరింత విషమిస్తాయి, హానితప్ప మరొకటేమీ కలగదు.

జూలై 13న జెన్‌మిన్‌జెపావ్ ఒక సంపాదకీయం వ్రాస్తూ మన పార్టీని పదేపదే విమర్శించింది. జూన్ 14 చైనా లేఖను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రకటించవేదన్న విషయానికి వక్రభాష్యాలు చేసింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు బాహాటంగా అమిత్రచర్యలు సాగిస్తున్నారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని వివాదాలను తీవ్రతరం చేయటానికి మొండిగా కృషి చేస్తున్నారు. మన పార్టీ విధానాలకు ఉద్దేశపూర్వకంగా వక్రభాష్యాలు చేస్తున్నారు. చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖను ప్రచురించకుండా మేము వేచి ఉండటానికి గల ఉద్దేశాలకు తప్పుడు వ్యాఖ్యానం చేస్తున్నారు. ఈ కారణాలవలన జూన్ 14 చైనా కమ్యూనిస్టు పార్టీ లేఖను, ఆ లేఖపై మా అంచనాను కూడా ప్రచురించవలసిన అవసరం ఏర్పడ్డది.

చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖ చదివిన వారందరికీ ఒక విషయం బోధపడుతుంది. ఐక్యత, సామరస్యం అను గంభీరమైన పదజాలం చాటున, మన పార్టీమీద, సోవియట్ దేశంపైన అమిత్రత్వంతో కూడిన నిందా ప్రచారం ఆ లేఖలో ఉంది. సోవియట్ దేశంలో కమ్యూనిజం విజయానికై మన ప్రజలు సాగిస్తున్న చరిత్రాత్మక పోరాటాన్ని, ప్రపంచమంతటా శాంతి, సోషలిజాల కొరకు మనం సాగిస్తున్న పోరాటాన్ని కించపరచే యత్నం అందులో ఉంది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీపైన, సోవియట్ యూనియన్‌పైన ప్రత్యక్షంగా, పరోక్షంగా వేసిన నిందలు ఈ లేఖనిండా ఉన్నాయి.

ఈ లేఖ రచయితలు అప్రతిష్ఠాకరమైన కల్పనలు చేయటానికి వెనుకాడలేదు ఈ కల్పనలు కమ్యూనిస్టులకు అవమానకరమైనవి. "అంతర్జాతీయ కార్మికవర్గ ప్రయోజనాలకు, యావత్ ప్రపంచ ప్రజల ప్రయోజనాలకు ద్రోహం", "మార్క్సిజం-లెనినిజం నుండి, కార్మికవర్గ అంతర్జాతీయత నుండి పెడమార్గాన్ని పట్టటం", "సామ్రాజ్యవాదుల ఎదుట పిరికితనాన్ని ప్రదర్శించటం", "చారిత్రక పురోగతిలో ఒక అడుగు వెనక్కి వేయటం", "యావత్ కార్మికవర్గాన్ని, శ్రామిక ప్రజలను నిర్మాణరీత్యా, నైతికంగా నిరాయుధులను చేయటం", మనదేశంలో "పెట్టుబడిదారీవ్యవస్థ

పునఃస్థాపనను సాయపడటం" వంటి అనేక అభూత కల్పనలు టాస్ 14 చైనా రేఖలో ఉన్నవి. లెనిన్ మహాశయుడు నిర్మించిన పార్టీని గురించి, సోషలిజానికి మాతృదేశమైన మన దేశాన్ని గురించి, ప్రపంచంలో మొట్ట మొదటగా సోషలిస్టు విప్లవాన్ని సాధించి, అంతర్జాతీయ సామ్రాజ్య వాదానికి,ఆంతరంగిక విప్లవ ప్రతీఘాతకులకు వ్యతిరేకంగా తీవ్రపోరాటాలు జరిపి, సోషలిస్టు విజయాలను నిలబెట్టుకున్న మన దేశాన్ని గురించి, కమ్యూనిజం నిర్మాణంలో అసమానమైన దీక్షను, అత్యద్భుతమైన సాహసాన్ని ప్రదర్శిస్తున్న మనలను గురించి, ప్రపంచ కార్మికవర్గంపట్ల మన విధులను నిజాయతీతో నిర్వర్తిస్తున్న మన పార్టీని గురించి, ఇలాంటి మాటలను వారంటున్నారు.

దాదాపు అర్ధశతాబ్దంగా సోవియట్ దేశం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన, మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతవిజయం కోసం, యావత్ ప్రపంచ శ్రామిక ప్రజల స్వేచ్ఛాస్వాతంత్ర్యాల కొరకు పోరాటం సాగిస్తున్నది. సోవియట్ ప్రభుత్వం ఏర్పడ్డ మొట్టమొదటి రోజు నుండి, లెనిన్ మహాశయుడు సోవియట్ దేశ కర్ణధారిగా ఉన్న నాటినుండి ఈనాటి వరకు మన ప్రజలు, సామ్రాజ్యవాద వలసవిధానాలకు వ్యతిరేకంగానూ, నూతన జీవిత నిర్మాణం కొరకూ పోరాడుతున్న ప్రజలందరికీ, నిస్వార్థంగా అపారమైన సాయం చేస్తూ ఉన్నారు.

ఒక దేశం ఇతర దేశాలకు ఇంత పెద్ద ఎత్తున ఆర్థిక, శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో సహాయం చేసిన మరో ఉదంతం ప్రపంచ చరిత్రలోనే లేదు.

సోవియట్ ప్రజలు, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రదర్శిస్తున్న ఈ సౌహార్ద వైఖరి పూర్తి సత్ఫలితాలను చైనా శ్రామిక ప్రజలు, చైనీస్ కమ్యూనిస్టులూ అనుభవిస్తూనే ఉన్నారు. తమ మాతృదేశ విముక్తికై విప్లవపోరాటం సాగించిన రోజులలోనూ, సోషలిజం నిర్మాణ దశలోనూ ఈ ఫలితాలను వారు పొందే ఉన్నారు. చైనా ప్రజారిపబ్లిక్ ఏర్పడిన మరుక్షణమే సోవియటు ప్రభుత్వం చైనాతో పరస్పరస్నేహ, సహకారమైత్రీ ఒప్పందాన్ని చేసుకున్నది. సామ్రాజ్యవాదులు చొచ్చుకువచ్చే చర్యలను అరికట్టటానికి, దూరప్రాచ్యంలోనూ, మొత్తం ప్రపంచంలోనూ శాంతిని సుస్థిరం చేయటానికి ఈ ఒప్పందం శక్తివంతంగా సాయపడ్డది.

సోషలిస్టు నిర్మాణంలో తమకు గల దీర్ఘకాల అనుభవాలన్నిటినీ, చైనా వారికి సంతోష పూర్వకంగా సోవియటు ప్రజలు అందించారు. శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో విజయాలు కూడా అందచేశారు. చైనా ప్రజారిపబ్లిక్ ఆర్థికాభివృద్ధికి గణనీయమైన సాయాన్ని మన దేశం చేసింది, ఇప్పటికీ చేస్తున్నది. ప్రధానంగా సోవియట్‌దేశ సాయంతో ప్రజాచైనా అత్యాధునిక యంత్ర సామగ్రిగల 198 పరిశ్రమలను, కర్మాగారాలను, సంస్థలను నిర్మించుకున్నది. మనదేశం సాయంతో మోటారు వాహనాలు, విమానాలు, ట్రాక్టర్లు తదితరాలు నిర్మించే క్రొత్త క్రొత్త పరిశ్రమలను చైనా ఏర్పరచుకొన్నది. చైనా ప్రజా రిపబ్లిక్‌కు, సోవియట్ యూనియన్ 21 వేల కాపీలకు పైబడిన శాస్త్రీయ, సాంకేతిక పత్రాలను, 1400కు పైబడిన భారీపరిశ్రమల ప్రాజెక్టు నమూనాలను అందచేసింది. దేశరక్షణను వృద్ధిచేసుకొని, ఆధునికమైన రక్షణ పరిశ్రమను ఏర్పరచుకునేందుకు మనము చైనాకు నిరంతరాయంగా సహాయం చేస్తూనేవున్నాము. సోవియట్ హైస్కూళ్ళలోను, మన పరిశ్రమలలోను వేలాది చైనా నిపుణులు, కార్మికులు తరిఫీదు పొందారు. 88 పారిశ్రామిక సంస్థలను, ప్రాజెక్టులను నిర్మించేందుకుగాను, ఇప్పటికీ సోవియట్ యూనియన్ చైనాకు సాయం చేస్తూనే వుంది. గొప్పలు చెప్పుకునేందుకు ఇదంతా తడవటంలేదు. కాని ఇటీవలి కాలంలో సోవియట్‌దేశ సాయాన్ని తేలిక పరచేందుకు చైనా నాయకులు ప్రయత్నిస్తున్నందున, ఇదంతా చెప్పవలసి వచ్చింది. దీంతోపాటు సోవియట్ యూనియన్‌కు అవసరమైన సరుకులను చైనానుంచి దిగుమతి చేసుకున్నామనే అంశాన్ని కూడా మేము మరచిపోవటం లేదు.

చైనా, సోవియట్ ప్రజలమైత్రిని గురించి, ఉభయపార్టీల ఐక్యతను గురించి, సోవియట్ సహాయం ప్రాముఖ్యాన్ని గురించి కొద్దికాలం క్రితం వరకూ చైనా నాయకులు న్యాయంగాను, ఎంతో ఘనంగానూ ప్రసంగిస్తూ ఉండేవారు. సోవియట్‌దేశ అనుభవంనుంచి నేర్చుకోవలసిందిగా ప్రజలను వారు ఉద్బోధిస్తూ ఉండేవారు.

1957 లో కామ్రేడ్ మావో-సే-టుంగ్ ఇలా అన్నారు :

"జాతీయ విముక్తి పోరాటంలో చైనా ప్రజలకు సోవియట్ ప్రజల అండదండలు లభించాయి. చైనా విప్లవం విజయవంతమైన తర్వాత కూడా, చైనాలో సోషలిజం నిర్మాణానికి సోవియట్ యూనియన్ అపారమైన

సర్వతోముఖమైన సాయం చేస్తున్నది. దానిని చైనా ప్రజలు ఎన్నటికీ మరచిపోరు."

చైనా నాయకులీ విషయాన్ని మరచిపోతున్నారు. అందుకే విచారం కలుగుతూంది.

నవజీవన నిర్మాణంలో చైనా మహాప్రజలు సాధిస్తున్న విజయాలను మన పార్టీ, సోవియట్ ప్రజలూ ఎంతగానో ఆనందించారు. ఎంతో గర్వపడ్డారు. చైనా ప్రజారిపబ్లిక్ పదవ వార్షికోత్సవ సమయంలో పెకింగ్‌లో జరిగిన ఒక విందులో ప్రసంగిస్తూ కామ్రేడ్ ఎన్. ఎస్. కృశ్చేవ్ ఇలా అన్నారు :

'సాహసవంతులు, కష్టపడి పనిచేసేవారూ ఐన చైనా ప్రజలు ప్రతిభావంతమైన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం క్రింద, అధికారం చేజిక్కిన తరువాత ప్రజ లెంతటి ఘనవిజయాలు సాధించగలరో నిరూపించారు. చైనా ప్రజలు, చైనా కమ్యూనిస్టుపార్టీ సాధించిన విజయాలను ఇప్పుడు ప్రతి ఒక్కరూ గుర్తిస్తున్నారు.

'ఏ మార్గం ద్వారా, ఏ విధానం క్రింద ప్రజల సృజనాత్మక శక్తులు, సామర్థ్యాలు పూర్తిగా అభివృద్ధి చెందగలవో, ప్రజలు బ్రహ్మాండమైన సృజన శక్తియొక్క విస్తృతాన్ని, గాంభీర్యాన్ని ప్రదర్శించగలరో ఆసియా, ఆఫ్రికాలలోని ప్రజలు నేడు గ్రహిస్తున్నారు.

పరిస్థితులీవిధంగా ఉండగా చైనా నాయకులు, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సాధారణపంథా నుండి వేరుపడడం ప్రారంభించారు.

1960 ఏప్రియల్‌లో చైనావారు 'లెనినిజం చిరస్థాయి అగుగాక' అను వ్యాస సంపుటిని ప్రకటించారు. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంతో తమకుగల విభేదాలను వారందులో బహిరంగంగా వెల్లడించారు. ప్రసిద్ధి చెందిన లెనిన్ రచనలనుండి, సందర్భశుద్ధిలేని తప్పుడు వ్యాఖ్యానాలతో కూడిన ఉల్లేఖనలపైన, వక్రభాష్యాలపైన ఈ సంపుటి ఆధారపడి ఉంది. 1957 లో మాస్కో కమ్యూనిస్టుపార్టీల సమావేశం ఆమోదించిన ప్రకటన పునాదులకే విరుద్ధమైన ప్రతిపాదనలు ఈ సంపుటిలో వున్నాయి. 1957 ప్రకటనపై చైనా కమ్యూనిస్టుపార్టీ తరఫున మావో-సే టుంగ్ సంతకం చేశారు. వేర్వేరు సాంఘిక వ్యవస్థలు గల రాజ్యాల మధ్య శాంతియుత సహజీవనం సాధ్యమనే లెనినిస్టు విధానాన్ని, ప్రస్తుత యుగంలో ప్రపంచ

యుద్ధాన్ని నివారించవచ్చు లనే అంశాన్ని, సోషలిస్టు విప్లవాభివృద్ధి శాంతియుతమైన లేక తద్విరుద్ధమైన పద్ధతులలో సాగవచ్చుననే అంశాన్ని వీటన్నిటినీ నిరాకరించే ఉల్లేఖనలు 'లెనినిజం చిరస్థాయి అగుగాక' అను సంపుటిలో ఉన్నాయి. చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు అన్ని సోదర పార్టీలచేత తమ అభిప్రాయాలను బలవంతంగా ఒప్పింపటానికి ప్రయత్నాలు ప్రారంభించారు.

1960 జూన్‌లో, ప్రపంచ కార్మిక సమాఖ్య సర్వసభ్య సమావేశం పెకింగ్‌లో జరిగింది. అప్పుడు, ఇతర సోదరపార్టీల నాయకులకు తెలియకుండానే చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు పెకింగ్‌లో ఉన్న పెక్కు పార్టీల ప్రతినిధుల ప్రత్యేక సమావేశాన్నొకదాన్ని జరిపారు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ విధానాలను, ఇతర మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలను, 1957 మాస్కో సభా ప్రకటనను చైనా నాయకులు ఆ సమావేశంలో బహిరంగంగా విమర్శించారు.

అంతేకాదు. చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు సోవియటు కమ్యూనిస్టు పార్టీతోనూ, ఇతర సోదర పార్టీలతోనూ తమకు గల విభేదాలను ఒక పార్టీయేతర ప్రజాసంస్థ వేదికపై ప్రవేశపెట్టారు.

చైనా నాయకుల ఈ చర్యలు సోదర పార్టీలకు చాలా ఆందోళన కలిగించాయి. ఇది గమనించి 1960 లో బుఖారెస్టులో జరిగిన కమ్యూనిస్టు పార్టీల సమావేశంలో, చైనా నాయకులతో గల విభేదాలను చర్చించటానికి ఒక ప్రయత్నం జరిగింది. చైనా నాయకుల భావాలను, ఆచరణను 50 దేశాల కమ్యూనిస్టు, కార్మికపార్టీల ప్రతినిధులు సోదర భావంతో అక్కడ విమర్శించారు. మాస్కో ప్రకటన కనుగుణంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంతో ఐక్యతా సహకారమార్గాన్ని తిరిగి చేపట్టవలసిందిగా చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకులకు వారు విజ్ఞప్తి చేశారు.

దురదృష్టవశాత్తు స్నేహపూరితమైన ఈ సలహాను చైనా కమ్యూనిస్టుపార్టీ త్రోసిపుచ్చింది. తన తప్పుడు విధానాలను కొనసాగిస్తూ సోదర పార్టీలతో తమకు గల విభేదాలను తీవ్రతరం చేయసాగింది.

ఘటనలు ఆ విధంగా పరిణామం చెందకుండా నివారించేందుకై, చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీతో చర్చలు జరిపేందుకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఒక ప్రతిపాదన చేసింది. 1960 సెప్టెంబరులో

మాస్కోలో ఈ చర్చలు జరిగాయి. అప్పటికే, అభిప్రాయ భేదాలను అధిగమించటం అసాధ్యమైంది. సోదర పార్టీల సలహాలను విని నిరాకరించే చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గంవారి మొండితనంవల్లనే ఈ చర్చలలో అంగీకారం కుదరటం అసాధ్యమైంది.

1960 నవంబరులో 81 దేశాల కమ్యూనిస్టు, కార్మిక పార్టీల సమావేశం మాస్కోలో జరిగింది. అందులో సోదర పార్టీలలో అత్యధిక సంఖ్యాకులు చైనా నాయకుల తప్పుడు భావాలను, సిద్ధాంతాలను తోసి పుచ్చారు. చైనా ప్రతినిధివర్గం ఈ సమావేశంలో మొండిగా తన ప్రత్యేక వాదానికే కట్టుబడి ఉన్నది. తాను పూర్తిగా వేరుపడిపోయే ప్రమాదం ఏర్పడిన మీదట, ప్రకటనపై సంతకాలు చేసింది.

1960 ప్రకటనపై చైనా నాయకులు అలా సంతకం చేయటంలో అసలు ఉద్దేశం, ఎత్తుగడ కోసమని ఇప్పటికే పూర్తిగా తేటతెల్లమైంది. ఈ సభ ముగిసిన కొద్ది రోజులకే తిరిగి వారు తమ విధానాన్ని ప్రచారం చేయసాగారు. ఆల్బేనియా లేబరు పార్టీ నాయకత్వాన్ని ఇందుకొక సాధనగా వారు వాడుకున్నారు. మన పార్టీకి వెనుకనుండి, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీపైన, సోవియట్ ప్రభుత్వంపైన దాడి ప్రారంభించారు.

చైనా కమ్యూనిస్టు పార్టీతో సంబంధాలను మెరుగుపర్చు కోటానికి 1961 అక్టోబరులో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ సరికొత్త యత్నాలు చేసింది. కామ్రేడ్స్ ఎన్. ఎస్. కృశ్చేవ్, ఎఫ్.ఆర్. కోజ్లోవ్, ఎ. ఐ. మికొయాన్లు, కామ్రేడ్స్ చౌ ఎన్ లై, పెంగ్‌చెన్‌గ్ తదితర ప్రముఖ చైనా కమ్యూనిస్టు నాయకులతో సంభాషణలు జరిపారు. వీరంతా 22 వ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ మహాసభకు హాజరు కావడానికై మాస్కోకు వచ్చినప్పుడు, ఈ చర్చలు జరిగాయి. 22 వ పార్టీ మహాసభ చర్చించిన ప్రధాన సిద్ధాంత సమస్యలపై సోవియట్ పార్టీ కేంద్రకమిటీ వైఖరిని ఎన్. ఎస్. కృశ్చేవ్ ఆ ప్రతినిధి వర్గానికి తెలియజేశారు. చైనా కమ్యూనిస్టు పార్టీతో స్నేహ సహకారాలను పెంపొందింప చేసుకునే విషయమై సోవియట్ దేశానికి గల శ్రద్ధాసక్తులను కృశ్చేవ్ నొక్కి చెప్పారు.

1962 ఫిబ్రవరి 22 న, మే 31 న సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీకి లేఖలు వ్రాసింది. కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత బలహీనపడితే ఉమ్మడి లక్ష్యానికి జరగ గల ప్రమాదాన్ని గురించి ఆ లేఖలలో ప్రస్తావించబడ్డది; చైనా-సోవియట్ ముఖ్యసంబంధాలలో ఏర్పడ్డ ఇబ్బందులను సామ్రాజ్యవాదులు తమ స్వప్రయోజనాల సాధనకు వినియోగించుకోకుండా చైనా నాయకులు జాగ్రత్త పడాలని మనము అప్పుడు సూచించి ఉన్నాము.

ఆంతరంగిక, రాజకీయ సమాచారాన్ని పరస్పరం అందచేసుకోవటం, అంతర్జాతీయ ప్రజాసంస్థలలో సోదర పార్టీలు అవలంబించవలసిన విధానాలను సమన్వయ పరచుకోవడంవంటి సమస్యలపై మరింత సమర్థవంతమైన చర్యలను తీసుకోవడానికి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ సూచించింది.

అయితే అన్ని రంగాలలో చైనా కమ్యూనిస్టు పార్టీతోనూ, చైనా ప్రజా రిపబ్లిక్‌తోనూ సంబంధాలను వృద్ధిచేసుకునేందుకు ఉద్దేశించబడిన యీ లేఖలకూ, తదితర ప్రాక్టికల్ చర్చలకూ పెకింగ్‌నుండి సమాధానం లేదు.

గత సంవత్సరం ఆకురాల్లు కాలంలో సోవియట్ దేశంలో చైనా రాయబారి లూషియో పదవీ విరమణచేసి స్వదేశానికి వెళ్ళే సందర్భంలో, సోవియట్ పార్టీ కేంద్రకమిటీ అధ్యక్షవర్గం ఆయనతో సుదీర్ఘ సంభాషణలు జరిపింది. ఈ చర్చలలో కూడా మరొకసారి, సోవియట్-చైనా స్నేహాన్ని దృఢతరం చేసే విషయమై కేంద్రకమిటీ అధ్యక్షవర్గ సభ్యులు చొరవను ప్రదర్శించారు. ఈ క్రింది ప్రతిపాదనను మావోసేటుంగ్‌కు అందచేయవలసిందిగా కామ్రేడ్ ఎన్. ఎస్. కృశ్చేవ్, లూషియోను కోరారు. "అన్ని వివాదాలను, విభేదాలను పక్కకు తోసేద్దాం. ఎవరి వైఖరి సరైనది, ఎవరి వైఖరి కాదు అనే ప్రశ్ననే ప్రస్తావించవద్దు. పాత విషయాలను తవ్వవద్దు. ఒక క్రొత్త పునాదిమీద మన సంబంధాలను ఇక ముందు కొనసాగిద్దాం." అదే ఆ ప్రతిపాదన. కాని చిత్తశుద్ధితో చేసిన ఈ విజ్ఞప్తికి మాకు అసలు ఇంతవరకూ సమాధానమే రాలేదు.

సోదరపార్టీలతో తమ విభేదాలను తీవ్రతరం చేసుకుంటూ చైనా పార్టీ నాయకులు తమ విభేదాలను ప్రభుత్వాల స్థాయికి విస్తరింప చేస్తూ పోగారు. సోవియట్ దేశంతోనూ, ఇతర సోషలిస్టు దేశాలతోనూ చైనాప

గల వర్తకాన్ని చైనా ప్రభుత్వ సంస్థలు తగ్గించసాగాయి. చైనా ప్రజా రిపబ్లిక్ ప్రభుత్వం కోరికపైన, సోవియట్ దేశంతో చైనా వ్యాపారం గత మూడేండ్లలో దాదాపు మూడవ వంతు తగ్గిపోయింది. ఇదంతా చైనా నాయకుల పొరపవల్లనే జరిగింది.

ఇలాంటి మార్గాన్ని చైనా రిప్రజా పబ్లిక్ నాయకత్వం చేపట్టడం మాకు విచారకరంగా ఉంది. సోవియటు-చైనా సంబంధాలను, సహకారాన్ని అభివృద్ధి చేసుకోవటం అవసరమని మనము ఎప్పుడూ నమ్ముతూనే ఉన్నాము. ఇప్పటికీ అదే మా నమ్మకం. ఇది ఉభయులకు లాభకరంగా ఉండేది. సోవియట్ దేశం, తదితర సోషలిస్టు దేశాలనుండి పెద్ద సహాయాన్ని పొందుతున్న ప్రజా చైనాకు మరీ లాభకరంగా ఉండేది. చైనాతో విస్తారమైన సంబంధాలను సోవియట్ దేశం ఇదివరకు ఏర్పరచుకుంది. ఇప్పటికీ ఆ సంబంధాలు పెరగాలనే కోరుకుంటున్నది, కాని తరగాలని కాదు. సోషలిస్టు దేశాలతో ఆర్థిక సంబంధాలను మెరుగుపరచుకునే విషయమై చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు ప్రథమ ప్రాధాన్యం ఇచ్చి ఉండవలసింది. కాని ఆచరణలో చైనా తద్వ్యతిరేక ధోరణిలో నడువసాగింది. అట్టి చర్యలద్వారా చైనా ఆర్థిక విధానం ఎట్టి దుష్ఫలితాలకు గురి అవుతుందో కూడా గమనించలేదు.

సోషలిస్టు దేశాలతో తమ సంబంధాలు తగ్గిపోవటానికి ఎవరు బాధ్యులో చైనా నాయకులు నిజాయితీతో తమ ప్రజలకు చెప్పలేదు. సోవియటు కమ్యూనిస్టుపార్టీ దేశీయ, విదేశాంగ విధానాలను అప్రతిష్టపాలు జేస్తూ సార్వత్రిక ప్రచారంతోపాటు, చైనా కమ్యూనిస్టులలోనూ, ప్రజలలోనూ సోవియట్ వ్యతిరేక భావాలను రెచ్చగొట్టడం సైతం ప్రారంభమైంది.

ఈ పొరపాటు చర్యలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, చైనీస్ కామ్రేడ్స్ దృష్టికి తెచ్చింది. ఏవో వివాదాలు, విభేదాలు కారణంగా, ప్రజలు ఒక పార్టీని ఆకాశాని కెత్తడం, మరొకపార్టీపై దుమ్మెత్తిపోయడం లాంటి చర్యలు చేసేటట్లు ప్రోత్సహించకూడదని వారికి తెలియజేశాము. సోదర పార్టీల మధ్య విభేదాలు కేవలం తాత్కాలికమైనవనీ, సోషలిస్టు దేశాల ప్రజలమధ్య ఉండవలసిన సంబంధాలు శతాబ్దాలవరకు నిలవవలసినవనీ ప్రతి కమ్యూనిస్టుకూ తెలిసిందే.

కాని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చేసిన హెచ్చరికలను చైనా నాయకులు ప్రతిసారీ పెడచెవిని పెడుతూనే వచ్చారు. చైనా-సోవియట్ సంబంధాలను మరింత చెడగొట్టే చర్యలు వారు సాగించారు.

1961 చివరినుండి అంతర్జాతీయ ప్రజాతంత్ర సంస్థలలో, చైనా ప్రజాప్రతినిధులు, తమ తప్పుడు అభిప్రాయాలను బలవంతంగా రుద్దటానికి ప్రారంభించారు. 1961 డిసెంబరులో ప్రపంచ శాంతి సమితి స్టాక్‌హోం సమావేశంలో చైనా ప్రతినిధివర్గం, ప్రపంచ శాంతి నిరాయుధీకరణ మహాసభ జరగాలనే ప్రతిపాదనను వ్యతిరేకించింది.

1962 సంవత్సరంలో ప్రపంచ కార్మిక సమాఖ్య కార్యకలాపాలు, ప్రపంచ శాంతి ఉద్యమం, ఆఫ్రికా-ఆసియా సంఘీభావ ఉద్యమం, ప్రజాతంత్ర యువజన ప్రపంచ సమాఖ్య, ప్రజాతంత్ర మహిళల అంతర్జాతీయ సంస్థ, ఇంకా అనేక సంస్థలు-చైనా ప్రతినిధుల విచ్ఛిన్నకర చర్యల ఫలితంగా ప్రమాదానికి గురైనాయి.

మోషీలో జరిగిన మూడవ ఆఫ్రికా-ఆసియా ప్రజల సంఘీభావ మహాసభలో చైనా ప్రతినిధులు, యూరప్ దేశాల సోషలిస్టు రాజ్యాల ఆసియా-ఆఫ్రికా ఐక్యతాసంఘాల ప్రతినిధులు మహాసభలో పాల్గొనడాన్ని ప్రతిఘటించారు. చైనా ప్రతినిధి వర్గ నాయకుడు సోవియట్ ప్రతినిధితో మాట్లాడుతూ "శ్వేతజాతి ప్రజలకు ఇక్కడ స్థానంలేదు" అన్నాడు.

జకార్తాలో జరిగిన పాత్రికేయుల మహాసభలో, సోవియట్ దేశం ఆసియా దేశం కాదనే సాకుతో సోవియట్ పాత్రికేయులు మహాసభలో పూర్తి సభ్యత్వంగల ప్రతినిధులుగా పాల్గొనరాదనే ధోరణిలో చైనా ప్రతినిధులు వ్యవహరించారు.

ఇటీవలనే జరిగిన ప్రపంచ మహిళా సభలో, అన్ని ఖండాల మహిళలకు మహాసభ చేసిన విజ్ఞప్తి పైన చైనా, ఆల్బేనియా దేశాల ప్రతినిధులు మాత్రమే వ్యతిరేకంగా ఓటుచేశారు. మొత్తం 110 దేశాల ప్రతినిధులు హాజరైనారు. అయినప్పటికీ ఈ అధిక సంఖ్యాకుల విధానం విచ్ఛిన్నకరమని, తప్పుడు రాజకీయ విధానమనీ చైనా నాయకులు ఆరోపిస్తున్నారు! ఇదే ఆశ్చర్యకరం. ఒక ఇద్దరు మాత్రమే సరైన మార్గంలో నడుస్తుండగా, మిగతా లక్షలాది స్వేచ్ఛా కాముక మహిళా ప్రపంచమంతా పెడమార్గాన పోతున్నదని అనుకోవచ్చునా?

చైనా కమ్యూనిస్టుపార్టీకి, సోవియటు కమ్యూనిస్టుపార్టీ తదితర సోదర పార్టీలతో ఏర్పడిన విభేదాలకు సంబంధించిన సంగ్రహ చరిత్ర ఇది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సాధారణ విధానానికి విరుద్ధంగా చైనాపార్టీ నాయకులు తమ ప్రత్యేక విధానాన్ని ప్రతిపాదిస్తున్నారు. హుకుంలు జారీ చేయటం ద్వారా, సమకాలీన సమస్యలపై తమ తప్పుడు విధానాలను ఇతరులపై బలవంతంగా రుద్దటానికి వారు ప్రయత్నిస్తున్నారు.

# 2

సోవియట్ కమ్యూనిస్టుపార్టీతోనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంతోనూ చైనా కమ్యూనిస్టుపార్టీకి గల భేదాల సారాంశం ఏమిటి? చైనా కమ్యూనిస్టుపార్టీ జూన్ 14న ప్రచురించిన లేఖను బాగా పరిశీలించిన వారెవరైనా నిస్సందేహంగా ఈ ప్రశ్న వేస్తారు.

మొదటగా ఈ లేఖలోని సిద్ధాంతీకరణలు ఆశ్చర్యాన్ని కల్గించవచ్చు. చైనా కామ్రేడ్సు వాస్తవంగా వాదించేది ఎవరితో? ఉదాహరణకు సోషలిస్టు విప్లవానికి అభ్యంతరించెప్పే కమ్యూనిస్టులున్నారా? సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడడమూ, జాతీయవిముక్తి ఉద్యమాన్ని బలపరచడమూ తమ విద్యుక్తధర్మంగా ఎంచని కమ్యూనిస్టులున్నారా? అటువంటప్పుడు అట్టి సిద్ధాంతీకరణలను చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం పట్టుదలగా ఎందుకు ప్రతిపాదిస్తున్నది?

ఈ ప్రశ్న కూడా ఉత్పన్నం కావచ్చు: చైనా కామ్రేడ్సు తమ లేఖలో చాల ముఖ్య సమస్యలపై తీసుకున్న వైఖరులతో ఏకీభవించడం ఎందువలన అసాధ్యం? ఉదాహరణకు శాంతి, యుద్ధమూ అన్న ముఖ్య సమస్యను తీసుకొండి. చైనా కమ్యూనిస్టుపార్టీ తన లేఖలో శాంతి, శాంతియుత సహజీవనం గురించి ప్రస్తావించింది.

నేటి ముఖ్య సమస్యలపై మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల అభిప్రాయాలకు వ్యతిరేకంగా చైనా కామ్రేడ్స్ దాడి ప్రారంభించారు. తద్వారా వారు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, తదితర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలూ ఎప్పుడూ వెలిబుచ్చిన అభిప్రాయాలనూ, వాటికి విరుద్ధమైన అభిప్రాయా

లనూ ఆయా పార్టీలను అంటగట్టడం ఒకటి; అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క పత్రాల్లో (డాక్యుమెంట్లు) గల సూత్రాలను వాచా గుర్తించి, తద్వారా వారు తమ తప్పుడు అభిప్రాయాలనూ, తమ తప్పుడు వైఖరులనూ కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నించడం రెండవది — ఇదీ విషయం, సారాంశం.

శాంతికై ప్రజల పోరాటానికి వ్యతిరేకంగానూ, విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాలమధ్య శాంతియుత సహజీవనానికి వ్యతిరేకంగానూ, నిరాయుధీకరణ మొదలగువాటికి వ్యతిరేకంగానూ, బాహాటంగా రావడం వల్ల యావత్తు ప్రపంచంలో కమ్యూనిస్టుల ముందు, శాంతికాముక ప్రజల ముందూ వారి విధానం బట్టబయలవుతుంది. వారు పేరు పడిపోతారు. అందువలన ఈ బహిరంగ చర్చలు మరింత పెంపొందడం ద్వారా, చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వైఖరులయొక్క బలహీనత మరింత స్పష్టమవడంవలన, తన నిజస్వరూపాన్ని పైవిధంగా కప్పిపుచ్చుకోడానికి ఆ నాయకత్వం మరింత మొండిగా ప్రయత్నిస్తున్నది.

చైనా కామ్రేడ్సుయొక్క ఈ వైఖరిని పరిగణనలోనికి తీసుకొనక పోతే, బయటనుండి చూసేవారికి ఈ వివాదం, పాండిత్య ప్రకర్షస్వభావం గలదిగనూ కన్పించవచ్చును. కీలక సమస్యలకు సంబంధలేని ప్రత్యేక సూత్రాలపై వివాదంగానూ కన్పించవచ్చు.

అయినప్పటికీ, వాస్తవంగా ప్రజల ముఖ్యప్రయోజనాలకు సంబంధించిన సమస్యలు, ఈ వివాదానికి మూలం.

ఇవి శాంతీ, యుద్ధానికీ సంబంధించిన సమస్యలు, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ పాత్ర, అభివృద్ధికి సంబంధించిన సమస్యలు, ఇవి 'వ్యక్తి పూజను' సంబంధించిన సిద్ధాంతానికీ ఆచరణకూ వ్యతిరేకమైన పోరాటానికి సంబంధించిన విషయాలు; ఇవి ప్రపంచ కార్మికోద్యమమూ, జాతీయ విముక్తి ఉద్యమమూ యొక్క వ్యూహమూ, ఎత్తుగడలకు సంబంధించిన సమస్యలు.

జీవితమే ఈ సమస్యలను ముందుకు తెచ్చింది. సోషలిస్టు దేశాలలోనూ, ప్రపంచమంతటా వచ్చిన గాఢమైన మార్పులూ, ఇటీవలి సంవత్సరాల్లో సోషలిస్టు శక్తులూ, సామ్రాజ్యవాద శక్తుల మధ్య బలాబలాల్లో వచ్చిన మార్పులూ, మన ఉద్యమానికి ఏర్పడిన నూతన అవకాశాలూ, ఈ

సమస్యలను ముందుకు తెచ్చాయి. కమ్యూనిస్టు ఉద్యమం ఈ సమస్యలకు సమాధానమివ్వాలి. ప్రపంచ పరిణామంయొక్క ప్రస్తుతదశ పరిస్థితులను సరిగా పరిగణనలోనికి తీసుకుని సాధారణ విధానాన్ని రూపొందించడం ద్వారా, కమ్యూనిస్టు ఉద్యమం ఈ సమస్యలకు సమాధానమిచ్చింది.

యావత్తు కమ్యూనిస్టు ఉద్యమ పరిణామంలో నూతనదశను తెచ్చి పెట్టిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ ఈ విషయంలో అద్భుతమైన పాత్ర వహించిందని కమ్యూనిస్టుపార్టీల ఏకాభిప్రాయం. ఈ అవగాహన 1957, 1960 మాస్కో ప్రకటనలలో నమోదు చేయబడింది. కమ్యూనిస్టుపార్టీలు సమిష్టిగా రూపొందించినవీ, మన యుగంలో కమ్యూనిస్టు ఉద్యమంయొక్క సాధారణ రాజకీయ గమనాన్ని రూపొందించినట్టిది ఈ రెండు ప్రకటనలూను.

కాని చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు దీనికి పోటీగా విభిన్న మార్గాన్ని ముందుకు తెచ్చారు. మూలసమస్యలపై కమ్యూనిస్టు ఉద్యమం యొక్క ఉమ్మడి విధానాన్నుండి వారి వైఖరులు మరింత వేరు పడుతు న్నాయి. శాంతి, యుద్ధమూ అనే సమస్యను ఇది ప్రధానంగా వర్తిస్తుంది.

యుద్ధమూ, శాంతి సమస్యల అంచనాలోనూ, వాటి పరిష్కారానికై తీసుకునే వైఖరిలోనూ అస్పష్టతగాని, మినహాయింపుగాని వుండరాదు. ఎందువల్లనంటే, ఇది ప్రజల భవిష్యతుకూ, మానవజాతి భవిష్యతుకూ సంబంధించింది గనుక.

శాంతి-యుద్ధం సమస్యపై చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వానికి మనతోనూ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంతోనూ ముఖ్యమైన భేదాభి ప్రాయాలున్నాయని సోవియట్ పార్టీ కేంద్రకమిటీ పార్టీకి, ప్రజలకూ నిష్కపటంగా చెప్పడం తన విద్యుక్త ధర్మమని భావిస్తోంది. ప్రపంచ అణుయుద్ధ నివారణా, విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాలమధ్య శాంతి యుత సహజీవనమూ, శాంతి పోరాటానికీ, ప్రపంచ విప్లవోద్యమాభివృద్ధికీ గల అంతః సంబంధమూ వంటి కీలక సమస్యలపై శుద్ధ విరుద్ధమైన వైఖరిలో ఈ భేదాభిప్రాయాల సారాంశం ఇమిడివుంది.

శాంతికోసమూ, ప్రపంచ అణుయుద్ధ విపత్తును నివారించడం కోసమూ పోరాటం సాగించడం అత్యంత ప్రధానమైన తక్షణ కర్తవ్యంగా మనపార్టీ 20, 22 మహాసభల్లోనూ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం 1957,

1960 ప్రకటనల్లోనూ నిర్దేశించింది. ప్రపంచశక్తుల బలాబలాలను మేము వాస్తవంగానే అంచనా వేస్తున్నాం. అందువలన, సామ్రాజ్యవాద స్వభావం మారకపోయినప్పటికీ, యుద్ధం ప్రారంభమయ్యే ప్రమాదం నివారింపబడక పోయినప్పటికీ, ఆధునిక పరిస్థితులలో బ్రహ్మాండమైన సోషలిస్టు దేశాలు ప్రధాన శక్తిగాగల శాంతిశక్తులు, తమ సంయుక్త కృషిద్వారా నూతన ప్రపంచ యుద్ధాన్ని నివారింపగలవనే నిర్ధారణలకు వచ్చాం.

యుద్ధం చేయు సాధనాలలో వచ్చిన సమూలమైన గుణాత్మకమైన మార్పులను, తత్ఫలితంగా ఏర్పడే ఫలితాలనూకూడ మేము ప్రశాంతంగా అంచనా వేస్తున్నాం. ఈ శతాబ్దం మధ్యలో అవతరించిన అణ్వస్త్రాలూ, రాకెట్లు, యుద్ధం గురించి ఉన్న పాతభావాలను మార్చివేశాయి. ఈ అణ్వస్త్రాలను కనీ వినీ ఎరుగనంతటి విధ్వంసక శక్తివుంది. ఒక శక్తివంతమైన ఉదజని-అణ్వస్త్ర బాంబు ప్రేలుడుశక్తి మొదటి, ద్వితీయ ప్రపంచ సంగ్రామాలతో సహా గత యుద్ధాలన్నింటిలోనూ ఉపయోగించిన మొత్తం ఆయుధాల ప్రేలుడుశక్తిని మించి ఉందని చెబితే సరిపోతుంది. అటువంటి వేలాది బాంబులను నిల్వచేయడం జరిగింది.

ఈ ప్రమాదాన్ని విస్మరించడానికి కమ్యూనిస్టులకు హక్కున్నదా? అణుయుద్ధ ఫలితాలను గురించి మనం ప్రజలకు చెప్పితీరాలా ? నిస్సందేహంగా చెప్పితీరాలని మేం విశ్వసిస్తున్నాం. ఇలా చెప్పడం ప్రజలను "భయభ్రాంతులను" చేస్తుందని పైనావారు నొక్కి చెబుతున్నారు కాని అలా జరగదు. పైపెచ్చు ఆధునిక యుద్ధం గురించి సత్యం చెప్పడంవలన, సైనిక ప్రమాదానికి మూలమైన సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, శాంతికోసము పోరాడేందుకు ప్రజాబాహుళ్యం యొక్క దీక్ష, శక్తి సమీకృతమవుతాయి.

అణుయుద్ధాన్ని నివారించడానికి ప్రజలను సమీకరించి, వారి పోరాటానికి నాయకత్వం వహించడం కమ్యూనిస్టుల చారిత్రక కర్తవ్యం.

కొత్త ప్రపంచయుద్ధాన్ని నివారించడం నిజమైన, సాధ్యమైన కర్తవ్యమే. మన కాలంలో దేశాలమధ్య యుద్ధం తప్పనిసరి కాదనే అత్యంత ముఖ్యమైన నిర్ధారణకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ మహాసభ వచ్చింది. ఈ నిర్ధారణ సదుద్దేశ్యాల ఫలితం కాదు; అది ప్రపంచంలో వర్గశక్తుల బలాబలాల వాస్తవమైన, ఖచ్చితమైన శాస్త్రీయ పరిశీలనా

ఫలితమే. ప్రపంచ సోషలిజం యొక్క ప్రబలమైన శక్తిపై ఆధార పడి, ఈ నిర్ధారణకు వచ్చాం.

యావత్తు ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమమూ ఈ సమస్యపై మా అభిప్రాయాలను కలిగివుంది. ఈ సమస్యపై కమ్యూనిస్టుపార్టీల ప్రకటన ఇలా నొక్కి చెప్పింది. "ప్రపంచయుద్ధాన్ని నివారించవచ్చు; భూమిపై సోషలిజం పూర్తిగా విజయం పొందే ముందుగానే, ప్రపంచంలో ఒక భాగంలో పెట్టుబడిదారీ విధానం ఉంటూండగానే సమాజంనుండి ప్రపంచయుద్ధాన్ని తొలగించే నిజమైన అవకాశం అవతరిస్తుంది."

ఈ ప్రకటనపై చైనా కామ్రేడ్స్ కూడా సంతకం చేశారు.

మరి చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంయొక్క వైఖరి ఏమిటి? వీరు వ్యాప్తిచేస్తున్న సిద్ధాంతాల అర్థం ఏమిటి? సామ్రాజ్యవాదం ఉన్నంత వరకూ యుద్ధాలను పూర్తిగా తొలగించలేం. శాంతియుత సహజీవనం అన్నది భ్రమ. అది సోషలిస్టు దేశాల విదేశాంగ విధానంయొక్క సాధారణ సూత్రం కాదు. శాంతికై పోరాటం, విప్లవ పోరాటాన్ని కుంటుపరుస్తుందీ అని.

యుద్ధమూ, శాంతీ సమస్యలపై ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క సాధారణ విధానానికి విరుద్ధంగా చైనావారు వ్యవహరిస్తున్నారని, ఈ సిద్ధాంతీకరణ అర్థం. కొత్త యుద్ధాన్ని నివారించగల అవకాశమందు వారికి విశ్వాసం లేదు. శాంతీ, సోషలిస్టు శక్తులను వారు తక్కువగా అంచనావేసి, సామ్రాజ్యవాద శక్తులను ఎక్కువగా అంచనా వేస్తున్నారు; యుద్ధ ప్రమాదానికి వ్యతిరేకంగా ప్రజాబాహుళ్యాన్ని సమీకరించడాన్ని వారు విస్మరిస్తున్నారు.

యుద్ధోన్మాదుల పన్నాగాలను భగ్నం చేయుటకూ, మన తరానికి, భవిష్యత్తరాల వారికి శాంతిని సాధించేటందుకూ, సోషలిస్టు దేశాల ప్రజలూ, అంతర్జాతీయ కార్మికవర్గమూ శాంతికాముక, ప్రజాతంత్ర శక్తులయొక్క సామర్థ్యమును చైనా కామ్రేడ్సు విశ్వసించడం లేదన్నది తెలుపుతున్నది. చైనా కామ్రేడ్సు యొక్క విప్లవ పదజాలం చాటున ఉన్నదేమిటి? కార్మికవర్గ శక్తులయందూ, వాటి విప్లవశక్తి సామర్థ్యాల యందూ అవిశ్వాసం, శాంతియుత సహజీవనమునకు గల అవకాశము

సందూ వర్గపోరాటంలో కార్మికవర్గం విజయమునందూ ఈ రెంటియందూ అవిశ్వాసం.

యుద్ధాన్ని నివారించేటందుకు సకల శాంతికాముక శక్తులు ఐక్యమవుతాయి. శాంతికాముక శక్తుల్లో వేర్వేరు వర్గాలూ, వేర్వేరు వర్గ ప్రయోజనాలూ వున్నాయి. అయినప్పటికీ శాంతికోసమూ, యుద్ధాన్ని నివారించుటకూ జరిపే పోరాటంద్వారా వాటిని ఐక్యపరచవచ్చు. ఎందువల్లనంటే, అణుబాంబు వర్గసూత్రానికి కట్టుబడి వుండదు కనుక. తన వినాశకర శక్తి పరిధిలోవున్న ప్రతివారినీ అది నాశనం చేస్తుంది.

చైనా కామ్రేడ్స్ ప్రతిపాదించిన మార్గాన్ని చేబట్టడమంటే అర్థం శాంతికై తాము పట్టు పట్టుదలతోనూ, ధైర్యంతోనూ సాధించిన పోరాటం వలన ప్రజల సానుభూతిని సంపాదించిన కమ్యూనిస్టు పార్టీలు ప్రజలకు దూరం కావడమన్న మాట.

ప్రజా బాహుళ్యం దృష్టిలో ఇప్పుడు సోషలిజమూ, శాంతీ అవిభాజ్యం.

చైనా కామ్రేడ్స్ అణుయుద్ధ ప్రమాదాన్నంతటినీ తక్కువగా అంచనా వేస్తున్నారనేది స్పష్టం. "అణుబాంబు కాగితంపులి అనీ", "అది ఏమాత్రం భయానకమైనది కాదనీ" వారు వాదిస్తున్నారు. సామ్రాజ్యవాదాన్ని సాధ్యమైనంత త్వరగా మట్టుపెట్టడమే ప్రధానమనీ వారంటున్నారు. కానీ దీనిని ఏవిధంగా, ఎంతటి నష్టంతో సాధించడమన్నది అప్రాధాన్యమని వారి అభిప్రాయంలా కనిపిస్తుంది.

ఇది ఎవరికి అప్రధానమని అడుగవచ్చు? అణుయుద్ధమే సంభవిస్తే, మృత్యువాతపడే కోట్లాది ప్రజలకా ఇది అప్రధానం? అటువంటి యుద్ధం సంభవించిన తొలి గంటలోనే, నామరూపాలు లేకుండా తుడిచిపెట్టుకుపోయే దేశాలకిది అప్రధానమా?

కోట్లాది ప్రజల భవిష్యత్తుతో చెలగాటమాడే హక్కు ఎవరికీ, చివరకు అగ్రరాజ్యాలకు కూడా లేదు. ప్రజల జీవనంనుండి యుద్ధాన్ని తొలగించడానికి, పెద్ద ఎత్తున ప్రజలు తుడిచిపెట్టుకుపోయే స్థితిని నివారించుటకూ, మానవ నాగరికత విలువలు నాశనమయ్యేస్థితిని నివారించుటకూ, కృషిచేయదలచుకోనటువంటి వారిని ఖండించవలసిందే.

విప్లవం కోసమనే పేరుతో "తప్పనిసరి త్యాగాలను" గురించి, చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ జూన్ 14 లేఖలో చాల చెప్పింది. యుద్ధంలో కోట్లాది ప్రజలను త్యాగం చేయడం సాధ్యమని కూడ కొంత మంది బాధ్యతగల చైనా నాయకులు ప్రకటించారు. చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ఆమోదించిన "లెనినిజం వర్ధిల్లుగాక" అన్న గ్రంథంలో ఈ విధంగా నొక్కి చెప్పారు: "విజయం సాధించిన ప్రజలు, నాశనమైన సామ్రాజ్యవాద శిథిలాలపై పెట్టుబడిదారీ విధానం క్రిందగల నాగరికత కన్నా వేయిరెట్లు ఉన్నతమైన నాగరికతను అద్భుతమైన వేగంతో నిర్మిస్తారు. వారు తమ నిజమైన దేదీప్యమానమైన భవిష్యత్తును నిర్మించుకుంటారు.

ప్రపంచ అణ్వస్త్ర రాకెట్టుయుద్ధం ఎటువంటి "శిథిలాలను" మిగుల్చుతుందో చైనా కామ్రేడ్సు గుర్తించారా ?

కోట్లాది మానవులశవాలపై "వేయిరెట్లు ఉన్నతమైన నాగరికతను సృష్టించు" విషయం గురించి చైనా నాయకత్వం అభిప్రాయంతో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ అంగీకరించజాలదు. ఈ విషయంలో యావత్తు పార్టీ, సోవియట్ ప్రజలూ ఏకగ్రీవంగా మమ్మల్ని బలపరుస్తున్నారు. అటువంటి అభిప్రాయాలు, మార్క్సిజం-లెనినిజం భావాలకు పూర్తిగా విరుద్ధం.

చైనా కామ్రేడ్స్‌ను యీ ప్రశ్న అడగవచ్చు: సామ్రాజ్యవాదాన్ని నాశనం చేయడానికి వారు ప్రతిపాదించే సాధనం ఏమిటి ?

సామ్రాజ్యవాదమూ, పెట్టుబడిదారీ విధానమూ నాశనం కావాలన్నదే మా వైఖరీను. పెట్టుబడిదారీ విధానం తప్పనిసరిగా నాశనమవుతుందని మేం విశ్వసించడమేగాక, వర్గపోరాటంద్వారా సాధ్యమైనంత త్వరలో దీనిని సాధించడానికి మేం సకల ప్రయత్నాలనూ చేస్తున్నాం. ఈ చారిత్రాత్మక సమస్యను నిర్ణయించేది ఎవరు? మొదటగా, ప్రతి దేశంలోని కార్మికవర్గ అగ్రగామి అయిన మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ, ఆ దేశ కార్మికవర్గం, శ్రామిక ప్రజలూ నిర్ణయిస్తారు.

చైనా కామ్రేడ్స్ మరో ప్రతిపాదన చేస్తున్నారు. "నాశనం చేయబడిన సామ్రాజ్యవాద శిథిలాలపై - అనగా యుద్ధం జరగడం

మూలంగా-దేదీప్యమానమైన భవిష్యత్తు నిర్మితమవుతుంది" అని వారు బాహాటంగా చెబుతున్నారు.

ఈ విషయంతో ఎవరైనా ఏకీభవిస్తే అప్పుడు నిజంగా శాంతియుత సహజీవన సూత్రాన్ని, శాంతిని దృఢతరం చేయడానికి పోరాటం ఆవశ్యకత లేదు, అటువంటి దుస్సాహసిక మార్గాన్ని మనం ఆమోదించజాలం, మార్క్సిజం-లెనినిజం సారానికి అది విరుద్ధం.

ప్రస్తుత పరిస్థితుల్లో ప్రపంచ యుద్ధం, అణుయుద్ధం అన్న విషయం సాధారణంగా అందరికీ తెలుసు. సామ్రాజ్యవాదులు స్వచ్ఛందంగా రంగం నుండి విరమించడానికి, తమ వద్దనున్న ముఖ్యసాధనాలన్నింటినీ ఉపయోగించకుండా ఇచ్ఛాపూర్వకంగానే చనిపోవడానికి ఎన్నడూ అంగీకరించరు.

అణ్వస్త్రాన్ని 'కాగితపు పులి' అని చెప్పేవారు, ఈ అస్త్రంయొక్క వినాశకర శక్తిని పూర్తిగా గుర్తించడం లేదనేది స్పష్టం.

మేమీ విషయాన్ని ప్రశాంతంగా పరిశీలిస్తున్నాం. ఈ అణ్వస్త్రాలను మేము ఉత్పత్తి చేశాం. చాలినంత సంఖ్యలో మేము వాటిని ఉత్పత్తి చేశాం. వాటి వినాశకరశక్తి మాకు పూర్తిగా తెలుసు. సామ్రాజ్యవాదం మాపై యుద్ధాన్ని ప్రారంభిస్తే దురాక్రమణ దారునిపై ఈ శక్తివంతమైన అస్త్రాన్ని ఉపయోగించడానికి మేము వెనకాడం; కాని మాపై దాడి జరగక పోతే ఈ అస్త్రాన్ని మొదటగా మేము ఉపయోగించం.

సామ్రాజ్యవాదులను అర్థింపుట ద్వారాగాక, విప్లవయుత మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలనూ, సకల దేశాల కార్మికవర్గాన్ని, స్వేచ్ఛా, జాతీయ స్వాతంత్ర్యమూ కొరకు పోరాడుతూన్న ప్రజలను సమీకృతం చేయుట ద్వారానూ, సోషలిస్టు దేశాల ఆర్థిక, రక్షణ బలంపై ఆధారపడుట ద్వారానూ మార్క్సిస్టు-లెనినిస్టులు సుస్థిర శాంతిసాధనకు కృషిచేస్తున్నారు.

అణుయుద్ధంవలన నాశనమైన పాత ప్రపంచంయొక్క శిథిలాలపై అద్భుత భవిష్యత్తును నిర్మిస్తామని చెప్పే చైనా కామ్రేడ్స్‌ను మేమిలా అడగవచ్చు: వారు, ఈ విషయంపై సామ్రాజ్యవాదులు పెత్తనం చేసే దేశాల్లోని కార్మికవర్గంతో సంప్రదించారా? పెట్టుబడిదారీ దేశాల్లో కార్మిక వర్గం తప్పక ఈ విధంగా వారికి సమాధానం చెబుతుంది: యుద్ధం ప్రారంభించి, సామ్రాజ్యవాదుల్ని తుడిచిపెట్టే కార్యక్రమంలో మా దేశాలను నాశనం చేయవలసిందని మేం మిమ్మల్ని కోరామా? పెట్టుబడిదారీ దేశాల్లో

గుత్త పెట్టుబడిదారులూ, సామ్రాజ్యవాదులూ కొద్దిమంది అనేదీ, ప్రజా బాహుళ్యంలో ఎక్కువభాగం కార్మికవర్గం, వ్యవసాయ కార్మికవర్గమూ, వృత్తులు చేస్తున్న మేధావులూ అనేది వాస్తవం.

సామ్రాజ్యవాదులూ, కార్మికులూ అన్న విచక్షణాభావాన్ని అణు బాంబు చూపదు. అణుబాంబు ప్రాంతాలకు ప్రాంతాలనే దెబ్బ కొడుతుంది. అందువలన ఒక్కో గుత్తపెట్టుబడిదారువంతున, లక్షలాది మంది కార్మికులు చనిపోతారు. కార్మికవర్గమూ, శ్రమజీవులూ అటువంటి "విప్లవకారులను" ఇలా అడుగుతారు :

మా ఉనికీ, మా వర్గపోరాటమూ సమస్యలను పరిష్కరించటానికి మీకు హక్కు ఎవరిచ్చారు? సోషలిజాన్ని మేమూ కోరుతున్నాం. కాని సోషలిజాన్ని యుద్ధాన్ని ప్రారంభించడం ద్వారా కాక, వర్గపోరాటం ద్వారా సాధించాలని మా అభిలాష.

పెట్టుబడిదారీ విధానాన్ని రద్దుచేయడానికి, ఇది ఇక ఏమాత్రం వర్గ దృక్పథ వైఖరి కాదని ఏదో తద్భిన్నమైన ఉద్దేశాలున్నాయనే న్యాయమైన అనుమానాన్ని చైనా వాదన రేకెత్తించవచ్చు. పీడించేవారూ పీడితులూ, పాత ప్రపంచపు శిథిలాలక్రింద కప్పడిపోతే, "అద్భుతమైన భవిష్యత్తును" నిర్మించేది ఎవరు?

"సకలదేశాల కార్మికులారా, ఏకంకండు" అన్న నినాదంలో వ్యక్త మైన అంతర్జాతీయ వైఖరికి బదులు, ఎటువంటి వర్గదృక్పథమూ లేని "తూర్పుగాలి పడమటి గాలికన్నా మించిపోయింది" అన్న నినాదాన్ని చైనావారు మొండిగా ప్రచారం చేస్తున్నారు. ఈ సందర్భంలో ఈ విష యాన్ని గమనించకుండా ఉండడం అసాధ్యం.

సోషలిస్టు విప్లవం అన్న సమస్యపై మనపార్టీ మార్క్సిస్టు-లెని నిస్టు వర్గవైఖరులకు దృఢంగా కట్టుబడివుంది. బయటనుండి సైనికజోక్యం లేకుండా ప్రతి దేశంలోనూ విప్లవాలను ఆయాదేశాల కార్మికవర్గమూ, శ్రామిక ప్రజలు కొనసాగిస్తారనేది మా అభిప్రాయం.

ఒకవేళ సామ్రాజ్యవాద "ఉన్మాదులు" గనుక యుద్ధాన్ని ప్రారం భిస్తే, ప్రజలు పెట్టుబడిదారీ విధానాన్ని తుడిచిపెట్టేసి, పాతేస్తారనేది నిస్సందేహం. కాని, కమ్యూనిస్టులు ప్రజాప్రతినిధులూ, సోషలిస్టు మాన వతను నిజంగా ప్రచారం చేసేవారూను. అటువంటి కమ్యూనిస్టులు, కోట్లాది

ప్రజలు నాశనమయ్యే మరో ప్రపంచ యుద్ధాన్ని నివారించడానికి సకల ప్రయత్నాలూ చేయాలి.

మరో ప్రపంచ యుద్ధాన్ని నివారించుటకూ, విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాలమధ్య శాంతియుత సహజీవనాన్ని కాపాడేందుకూ సాగే పోరాటంలో, ప్రజల ప్రయోజనాలు నిజంగా ప్రియతమ మైనవని భావించే ఏ పార్టీకూడా తన బాధ్యతను గుర్తించడంలో విఫలం కాజాలదు.

మన పార్టీ వైఖరిని వివరిస్తూ కామ్రేడ్ యన్. యస్. కృశ్చేవ్ యిలా చెప్పారు: "సామ్రాజ్యవాదమూ, వలస విధానమూ ఉన్నంతవరకూ, విముక్తి యుద్ధాలుంటాయి. ఇవి విప్లవ యుద్ధాలు. వలసవాదులు ప్రజలకు స్వాతంత్ర్యాన్ని ఇచ్ఛాపూర్వకంగా ఇవ్వరు. గనుక, అటువంటి యుద్ధాలు న్యాయమైనవే గాక, అనివార్యమైనవి కూడా. అందువలన ప్రజలు సాయుధ పోరాటంతో సహా, పోరాటం ద్వారా మాత్రమే తమ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను సాధించగలరు."

జాతీయ విముక్తి ఉద్యమానికి సోవియట్ యూనియన్ విస్తృతమైన సహాయం చేస్తున్నది. వియత్నాం, ఈజిప్ట్, ఇరాక్, ఆల్జీరియా, యెమెన్, క్యూబా తదితర దేశాల ప్రజలకు మనదేశం ఆచరణ రూపంలో చేసిన సహాయం అందరికీ తెలుసు.

లెనినిస్టు సూత్రాలయొక్క శాంతియుత సహజీవనం, సోవియట్ విదేశాంగ విధాన సాధారణ పంథా అని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రకటించింది. మనపార్టీ ఆ విధానాన్ని నిస్సంకోచంగా అనుసరిస్తున్నది. 1953 నుండీ, అందులోనూ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ అనంతరం, మన శాంతియుత విధానం కార్యకలాపాలు బాగా ఎక్కువయ్యాయి; ప్రజాబాహుళ్య ప్రయోజనాల కనుగుణంగా అంతర్జాతీయ సంబంధాల పరిణామంపై ఈ విధానం ప్రభావం బాగా పెరిగింది.

సామ్రాజ్యవాద దేశాలతోనూ, సోషలిస్టు దేశాలతోనూ, ఇటీవల వలస దాస్యంనుండి విముక్తి పొందిన దేశాలతోనూ మనకు గల పరస్పర సంబంధాలన్నింటినీ "శాంతియుత సహజీవనం" అన్న ఒకే ఒక సూత్రంలో ముడిపెడుతున్నామని చైనా కామ్రేడ్ ఆరోపిస్తున్నారు. అసలు విషయం అది కాదని వారికి బాగా తెలుసు. స్నేహమూ, సోదర (కామ్రేడ్లీ) భావంతో కూడిన పరస్పర సహాయమూ అన్న సూత్రం, సోషలిస్టుదేశాల మధ్యగల

సంబంధాల్లో అత్యంత ముఖ్యమైన సూత్రం అని మొదట ప్రకటించింది సోవియట్ యూనియన్ అనీ, ఆ సూత్రానికి దృఢంగానూ, ఒకేవిధంగానూ సోవియట్ యూనియన్ కట్టుబడివుందనీ, కొత్తగా స్వతంత్రమైన దేశాలకు సోవియట్ యూనియన్ సర్వతోముఖంగా అన్నిరకాల సహాయం చేస్తున్న దనీ వారికి తెలుసు. అయినప్పటికీ కొన్ని ఉద్దేశ్యాలతో వారుతమకు లాభ దాయకంగా వుండేందుకు ఈ విషయాన్నంతటినీ వక్రంగా చిత్రించారు.

శాంతి, అంతర్జాతీయ భద్రతా, సార్వత్రిక సంపూర్ణ నిరాయుధీ కరణ, ద్వితీయ ప్రపంచ యుద్ధం అవశేషాల నిర్మూలనా, వివాదాంశ మైన అంతర్జాతీయ సమస్యలను సంప్రదింపుల ద్వారా పరిష్కరించు కోవడమూ - వీటన్నింటి కోసమూ సోవియట్ యూనియన్ పట్టుదలగా పోరాటం సాగించింది. ఆ పోరాటం సత్ఫలితాల నిచ్చింది. సోవియట్ దేశం ప్రఖ్యాతి ప్రపంచమంతటా ఇదివరకటి కన్నా పెరిగింది. అంత ర్జాతీయంగా మన స్థానం ఇంతకు ముందెన్నడూ లేనంత దృఢంగావుంది. దీనికి కారణం సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాల ఆర్థిక, సైనికశక్తి క్రమంగా పెరగడమూ, వాటి విదేశాంగ విధానమూను.

మనం లెనినిస్టు శాంతియుత సహజీవన విధానాన్ని అనుసరిస్తున్నా మని, ఇకముందుకూడా అనుసరిస్తామనీ సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రకటిస్తోంది. ఈ విషయంలో మనపార్టీ సోవియట్ ప్రజల పట్ల, తదితర అన్నిదేశాల ప్రజలపట్ల తన బాధ్యతను గుర్తిస్తున్నది. శాంతిని సంరక్షించడమంటే సోషలిస్టు వ్యవస్థ పటిష్టం కావడానికి శక్తి వంతంగా తోడ్పడమన్నమాట; తత్ఫలితంగా, విముక్తి పోరాటమూ, ప్రపంచ విప్లవపరిణామమూయొక్క యావత్తు గమనంపై దాని ప్రభావం పెరుగుదలకూ తోడ్పడమన్నమాట.

శాంతి, యుద్ధమూ, శాంతియుత సహజీవనమూ సమస్యలపై సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, తదితర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలకూ, చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకులకు మధ్య గల అభిప్రాయాల తీవ్ర విభేదం 1962 కరేబియన్ సంక్షోభకాలంలో మరింత స్పష్టంగా ప్రదర్శిత మైంది. అది తీవ్రమైన అంతర్జాతీయ సంక్షోభం. గత సంవత్సరం అక్టోబరులో అణుయుద్ధపుటంచువరకు మానవజాతి వచ్చినంతగా ఇంతకు ముందెన్నడూ రాలేదు.

కరేబియన్ సంక్షోభకాలంలో మనము క్యూబాకు రాకెట్లు సరఫరా చేసి "దుస్సాహస విధానపు" తప్పును చేశామని ఒక వైపునా, ఆ తర్వాత క్యూబానుండి మనము రాకెట్లు ఉపసంహరించినపుడు అమెరికా సామ్రాజ్య వాదానికి "లొంగిపోయామని" మరొక వైపునా చైనావారు ఆరోపిస్తున్నారు. (అమెరికా కమ్యూనిస్టు పార్టీ ప్రకటనపై వారు "జెనిమిన్ జిఫావో" పత్రికలో 1963 మార్చి 8 న ప్రచురించిన ప్రముఖ వ్యాసంలో ఈ ఆరోపణలు చేశారు.)

అటువంటి ప్రకటనలు వాస్తవాలకు పూర్తిగా విరుద్ధం.

అసలు వాస్తవపరిస్థితు లేమిటి? అమెరికా సామ్రాజ్య వాదం క్యూబాపై త్వరలో సాయుధ దురాక్రమణ చేయనున్నదని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీకీ, సోవియట్ ప్రభుత్వానికీ విశ్వసనీయ మైన సమాచారం అందింది. దురాక్రమణను తిప్పికొట్టడానికీ, శక్తి వంతంగా క్యూబావిప్లవాన్ని సంరక్షించడానికీ మేము అత్యంత దృఢమైన చర్యలను తీసుకోవలసివుందనీ, కావలసినంత స్పష్టంగా మేం గుర్తించాం. శాపనార్థాలూ, హెచ్చరికలూ, చివరకు "తీవ్ర హెచ్చరికలంటూ" 250 సార్లు పదేపదే చేసినప్పటికీ, సామ్రాజ్యవాదులపై ఏమీ పనిచేయలేదు.

క్యూబా విప్లవాన్ని సంరక్షించవలసిన ఆవశ్యకత దృష్ట్యా, క్యూబాలో రాకెట్లను పెట్టే విషయంపై, క్యూబా, సోవియట్ ప్రభుత్వాలు ఒప్పం దానికి వచ్చాయి. ఎందుకంటే, అమెరికా సామ్రాజ్యవాదం యొక్క దురాక్రమణను నివారించడానికి ఇదొక్కటే వాస్తవమైన మార్గం. ఆ విధంగా క్యూబాకు రాకెట్లు సరఫరా చేయడమంటే, క్యూబాపై దురాక్రమణ తలపెట్టినవారిని రాకెట్లతో తిప్పికొట్టడం జరుగుతుందని గట్టి సమాధానం చెప్పకమన్న మాట. సోవియట్ యూనియన్, క్యూబా దేశాలు తీసుకున్న అటువంటి దృఢనిర్ణయం అమెరికా సామ్రాజ్యవాదులను అదిరిపేసింది. తాము గనుక క్యూబాపై సాయుధదాడి తలపెడితే, తమ స్వంత భూభాగం లోనే పునాదులను కదిపివేసే దెబ్బ తమకు తగులుతుందని అమెరికన్ సామ్రాజ్యవాదులు చరిత్రలో మొదటిసారిగా తెలుసుకున్నారు.

అసలు విషయం, ఈ సమస్య కేవలం అమెరికాకూ, క్యూబాకూ సంబంధించింది మాత్రమే కాదు; అణ్వస్త్రాలు గల్గిన రెండు అగ్ర రాజ్యాల మధ్య ఘర్షణ కూడాను; కరేబియన్ సముద్ర ప్రాంతపు

సంక్షోభం ప్రపంచ సంక్షోభంగా మారిపుండేది. ప్రపంచ అణుయుద్ధ ప్రమాదం వాస్తవంగా ఏర్పడింది

అప్పటి పరిస్థితిలో రెండు మార్గాలు మాత్రమే వున్నాయి: "ఉన్మాదుల" మార్గాన్ని అనుసరించి (అనగా, అమెరికా సామ్రాజ్యవాదంయొక్క అత్యంత అభివృద్ధి నిరోధక, దురాక్రమణవాంఛాపూరిత శక్తుల ప్రతినిధులను 'ఉన్మాదులని' పిలుస్తారు.) అణుయుద్ధాన్ని ప్రారంభించే మార్గాన్ని చేపట్టడమో లేదా, క్షిపణులు (రాకెట్లు) ఇవ్వడంవలన అవకాశాలను వినియోగించుకొని, సంక్షోభాన్ని శాంతియుతంగా పరిష్కరించు టకు ఒప్పందానికై రావడానికి సకల చర్యలు తీసుకుని, క్యూబా రిపబ్లిక్‌పై దురాక్రమణను నివారించడమో.

మేము రెండవ మార్గాన్ని చేపట్టామని అందరికీ తెలిసిందే. మేము సరైన పని చేశామని మాకు విశ్వాసం కలిగింది.

ఈ విషయంలో మన ప్రజలంతా ఏకాభిప్రాయంతో ఉన్నారని మా విశ్వాసం. తమను తాము రక్షించుకోడానికీ, విప్లవాన్ని, సోషలిజం ఆశయాన్ని సంరక్షించడానికీ తమకుగల శక్తిసామర్థ్యాలను సోవియట్ ప్రజలు అనేకసార్లు రుజువు చేశారు. యుద్ధం ఎంతటి బాధనూ, వ్యధనూ తెచ్చి పెడుతుందో, ప్రజలు ఎంత కష్టాలనూ, త్యాగాలనూ గురికావలసివుంటుందో సోవియట్ ప్రజలకు తెలిసినంత బాగా ఇతరులకెవరికీ తెలియదు.

క్యూబాపై అమెరికా, దాని మిత్రులూ దాడిచేయబోమన్న వాగ్దానానికి ప్రతిగా క్షిపణుల ఉపసంహరణ ఒప్పందమూ. క్యూబా ప్రజల వీరోచిత పోరాటమూ, శాంతికాముక దేశాలు వారికిచ్చిన మద్దత్తూ ఈ కారణాలవలన, ఈ సంక్షోభాన్ని కొనసాగింటూ తీసుకువెళ్ళాలనుకున్న అమెరికా సామ్రాజ్యవాదం యొక్క అతి దుస్సాహసవర్గాల పన్నాగాలను భగ్నం చేయడానికి వీలైంది. తత్ఫలితంగా, విప్లవ క్యూబాను సంరక్షించ డానికి, శాంతిని దక్కించుకోవడానికి వీలైంది.

క్యూబా చుట్టూ ఏర్పడిన ఈ సంక్షోభంలో, కెన్నెడీ ప్రభుత్వం కూడా కొంత విజ్ఞతనూ, వాస్తవిక వైఖరినీ అవలంబించిందని మనం చేసిన ప్రకటనను, "సామ్రాజ్యవాదానికి మెరుగులు దిద్దడం" గా చైనా నాయకులు పరిగణిస్తున్నారు. అన్ని బూర్జువా ప్రభుత్వాలూ, అవి చేసే

పనులన్నింటిలోనూ ఎంచిత్తూ హేతుబద్ధంగా ఉంటవని చైనావారు నిజంగా భావిస్తున్నారా?

సోవియట్ యూనియన్ ధైర్యంతోనూ, దూరదృష్టితోనూ తీసుకున్న వైఖరి, క్యూబా వీరోచిత ప్రజలూ, క్యూబా ప్రభుత్వమూ ప్రదర్శించిన సహనమూ, దృఢత్వమూ వలన సోషలిజమూ, శాంతిశక్తులూ సామ్రాజ్యవాద దురాక్రమణ వాంఛాపూరిత శక్తులను అణపగలవని, యుద్ధప్రచారకులపై శాంతిని విధించగలవని రుజువైంది. ఇది విజ్ఞతతో కూడిన విధానానికి పెద్ద విజయం. శాంతీ, సోషలిజం శక్తుల కిది పెద్ద విజయం; ఇది సామ్రాజ్యవాదులకూ, సైనిక దుస్సాహసిక శక్తులకూ ఓటమి.

దీని ఫలితంగా, విప్లవక్యూబా శాంతిగా జీవిస్తూ, సోషలిస్టు రివల్యూషన్ యునైటెడ్‌పార్టీ, క్యూబా ప్రజానాయకుడైన కామ్రేడ్ ఫైడల్ కాస్ట్రోరుజ్ నాయకత్వం క్రింద సోషలిజాన్ని నిర్మించుకుంటోంది.

అమెరికా అధ్యక్షునితో ఒప్పందం కుదుర్చుకుని, కరేబియన్ సంక్షోభం నిర్మూలనకు నాందీవాచకం పలికిన తర్వాత, చైనా కామ్రేడ్స్, సామ్రాజ్యవాదులను ఏ విషయంలోనూ నమ్మకూడదంటూ వాదిస్తూ, సోవియట్ యూనియన్‌పై దూషణలూ, నిందలూ పట్టుదలగా సాగించారు.

సోషలిజం, సామ్రాజ్యవాదం అన్న రెండు వ్యవస్థలూ, రెండు ప్రపంచాలూ ఉన్న శకంలో మనం జీవిస్తున్నాం. ఈ రెండు వ్యవస్థలకు చెందిన దేశాలమధ్య గల సంబంధాలలో తప్పనిసరిగ ఉత్పన్నమయ్యే సమస్యలన్నింటినీ, కేవలం ఆయుధశక్తితో మాత్రమే పరిష్కరించాలనీ, వాటి పరిష్కారానికై సకల సంప్రతింపుల, ఒప్పందాలమార్గాన్ని పూర్తిగా త్రోసిపుచ్చాలనీ భావించడం అర్థరహితం. అప్పుడు యుద్ధాన్నెవడూ అంత రించవు, అట్టి వైఖరికి మనం వ్యతిరేకం.

సామ్రాజ్యవాదులను ఏ విషయంలోనూ నమ్మరాదని, వాళ్లు ఇచ్చితంగా మోసం చేస్తారని చైనా కామ్రేడ్స్ వాదిస్తున్నారు. కాని, యిది విశ్వాసానికి సంబంధించిన విషయం కాదు. విజ్ఞతతో కూడిన అంచనాకు సంబంధించిన విషయం. కరేబియన్ ప్రాంతంలో సంక్షోభం తొలగిపోయి ఇప్పటికి 8 నెలలయింది. అమెరికా తన మాట నిలబెట్టుకుంటున్నది.

క్యూబాపై దాడి జరుగలేదు. మనం కూడా క్యూబానుండి రాకెట్లను తొల గిస్తామని చేసిన వాగ్దానం నెరవేర్చాము.

అయితే, మనం క్యూబా ప్రజలకు కూడా ఒక వాగ్దానం చేశామన్న విషయం మరువరాదు. అమెరికా సామ్రాజ్యవాదులు తమ వాగ్దానాన్ని నిలబెట్టుకొనక క్యూబాపై దాడిచేస్తే, క్యూబా ప్రజలను ఆదుకుంటామని, అమెరికా సామ్రాజ్యవాదులు దురాక్రమణచేస్తే, క్యూబా భూభాగంనుండి ఆ దేశ ప్రజలను ఆదుకోగలిగివుండినట్లే సోవియట్ భూభాగంనుండి మనం ఆదుకుంటామని విజ్ఞతగల ప్రతివాడూ అర్థం చేసుకుంటున్నారు. సోవియట్ భూభాగంనుండి క్యూబాను రక్షించవలసి వచ్చినప్పుడు రాకెట్లు కొంచెం ఎక్కువ దూరం వెళ్ళవలసి ఉన్నమాట నిజమే కాని, ఈ దూరంవలన వాటి గురిమీ తప్పదు.

సోవియట్ వైఖరి సౌభ్రాతృత్వ సంఘీభావ విధానమనీ, నిజమైన అంతర్జాతీయత అనీ క్యూబా విప్లవ నాయకులే అంగీకరిస్తున్నారు. అటు వంటప్పుడు, చైనా కామ్రేడ్స్ క్యూబా విప్లవనాయకుల అంచనాను మొండిగా యెందుకు విస్మరిస్తున్నారు? చైనా కామ్రేడ్స్ ఏ విషయంపట్ల అసంతృప్తి చెందారు? బహుశా క్యూబాపై దాడిని, ప్రపంచ యుద్ధాన్ని నివారించడం సాధ్యమైందన్న వాస్తవంపట్లనా వారి అసంతృప్తి!

కరేబియన్ సంక్షోభ కాలంలో చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం ప్రవర్తనాధోరణి ఏమిటి? ఈ క్లిష్ట సమయంలో సోవియట్ ప్రభుత్వం తీసుకున్న వాస్తవ దృఢవైఖరిని చైనా కామ్రేడ్స్ వ్యతిరేకించి, తమ స్వంత వైఖరిని అనుసరించారు. వారు తమకుగల ఏవో కొన్ని భావాలను బట్టి తమ విమర్శనా దాడినంతా దురాక్రమణ వాంఛాపూరిత అమెరికా సామ్రాజ్యవాదంపై గాక, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ యూనియన్‌లపైన సాగించారు.

ఏ సమయంలోనైనా సామ్రాజ్యవాదం యుద్ధాన్ని తెచ్చిపెట్టవచ్చు నని అంతకుముందు పదేపదే వాదిస్తూ వచ్చిన చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం ఎంతో క్లిష్టసమయంలో, పోరాట పటిమగల మిత్రులని, కామ్రేడ్, సోదరవైఖరిని తీసుకోకుండా, విమర్శకుని వైఖరిని తీసు కుంది. ఆ రోజుల్లో క్యూబా విప్లవం సంరక్షణకు చైనా నాయకులు ఆచ రణలో తీసుకున్న చర్యలను గురించి వారి ప్రకటనలను ఎవరూ వినలేదు.

దీనికి బదులు, చైనా నాయకులు కరేబియన్ సముద్రప్రాంతంలో అప్పటికే ఏర్పడిన క్లిష్టపరిస్థితిని తీవ్రతరం చేయడానికి ప్రయత్నించారు; అగ్నిలో ఆజ్యం పోశారు.

యుద్ధమూ, శాంతి సమస్యలపై చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వ నిజమైన ధోరణేమిటో, వాటిని గురించి తక్కువ అంచనా వేయడం, నిరాయుధీకరణకై పోరాటాన్ని ఉద్దేశపూర్వకంగా విస్మరించడమూ, చాల స్పష్టంగా ప్రదర్శితమైంది. ఈ సమస్యను కమ్యూనిస్టులు లేవనెత్తడానికే చైనా కమ్యూనిస్టులు అభ్యంతరం తెలుపుతున్నారు. ఈ విషయం గురించి వారు మార్క్సిజం-లెనినిజంను ప్రస్తావించేటంతవరకూ వెళ్లారు. వారొక వైపున నిరాయుధీకరణ "అసాధ్యమనీ", అది అవసరంలేదని, మరొక వైపునా రుజువు చేయడానికి వారు ప్రయత్నిస్తున్నారు.

ఉల్లేఖనలతో గారడీచేస్తూ ప్రపంచమంతటా సోషలిజం నెగ్గినపుడు మాత్రమే సార్వత్రిక నిరాయుధీకరణ సాధ్యమని రుజువు చేయడానికి వారు ప్రయత్నిస్తున్నారు.

మానవజాతి ఆయుధపోటీ పటంధ హస్తాల్లో ఉక్కిరిబిక్కిరి అవుతూన్న సమయంలోనూ, సామ్రాజ్యవాదులు అణ్వస్త్రాలను నిల్వచేస్తూ, మానవ జాతిని ప్రపంచయుద్ధంలో ముంచాలని బెదిరిస్తూన్న సమయంలోనూ, మార్క్సిస్టులు, సోషలిజం ప్రపంచమంతటా విజయం సాధించే వరకూ నిరీక్షిస్తూ వృథాగా కూర్చోవాలా?

అలా కూర్చోరాదు. కాలానుగుణ్యమైన పిలుపును అందుకోకుండా క్రియాశూన్యతలో వుండడం దారుణమైన నేరం.

ప్రజలపట్ల తమ బాధ్యత గుర్తించినట్టి, సార్వత్రిక, సంపూర్ణ నిరాయుధీకరణకూ, అణ్వస్త్రపరీక్షల నిల్పివేతకూ, అణ్వస్త్రాల నిషేధానికీ, ఇప్పటికే అనేక సంవత్సరాలు గట్టిగా, పట్టుదలగానూ పోరాడే, ఇంకా పోరాడుతూనే ఉన్నట్టి, నిజమైన మార్క్సిస్టు - లెనినిస్టులందరూ ఈ సత్యాన్ని ఎప్పటినుండో అర్థం చేసుకున్నారు.

శాంతికోసం పోరాడడంలోనూ, సార్వత్రిక నిరాయుధీకరణ నినాదాన్ని ప్రచారం చేయుటలోనూ మనము ప్రజా ప్రయోజనాల దృష్ట్యా, వాస్తవ పరిస్థితి పరిగణనలోనికి తీసుకొని, ముందుకు పోతున్నాం: ఇబ్బందులపట్ల మేము కళ్లుమూసుకు కూర్చోలేదు, సామ్రాజ్యవాదులు నిరాయుధీకరణపై

ఒప్పందం కుదరకుండా చేయడానికి, జాగుచేయడానికి సహజంగా సకల ప్రయత్నాలు చేస్తున్నారు. దీనివలన వారికి లాభం. సామ్రాజ్యవాదులు, తాము సంపన్నులయ్యే టందుకు పెట్టుబడిదారీ దేశాల్లో ప్రజలను భయాందోళనల్లో ఉంచడానికై ఆయుధాల పోటీని వినియోగించుకుంటున్నారు.

కాని, మనం తప్పక ఈ ప్రవాహం వాలుతోనే వెళ్లాలా? సామ్రాజ్య వాదం నడిచే మార్గంలోనే మనమూ వెళ్ళాలా? శాంతి, నిరాయుధీకరణలకోసం పోరాడేందుకు సకల శక్తులనూ సమీకరించడానికి మనం తప్పక నిరాకరించాలా?

అలా చేయకూడదు. అలా చేయడమంటే, దురాక్రమణ వాంఛా పూరిత శక్తులకూ, సైనికశక్తులకూ, సామ్రాజ్యవాదులకూ లొంగిపోవడ మన్నమాట. కార్మిక వర్గమూ, సకల దేశాల శ్రామిక ప్రజలూ, సామ్రాజ్యవాద ప్రభుత్వాలు నిరాయుధీకరణకు ఒప్పుకునేటట్లు చేయ గలవనీ, యుద్ధాన్ని నివారించగలవనీ, మేం భావిస్తున్నాం. అందుకుగాను శ్రామిక ప్రజలు తమ బలాన్ని తెలుసుకుని ఐక్యతను కూడదీసుకోవడం అన్నిటికన్నా అవసరం.

ప్రపంచ కార్మికవర్గంయొక్క సంఘటిత బలంతో సామ్రాజ్య వాద శక్తులనూ, యుద్ధశక్తులనూ వ్యతిరేకించడం అవసరం. ప్రపంచ కార్మికవర్గం, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకమైన సోషలిస్టు దేశాల రక్షణ బలమూ, భౌతికశక్తి పైన ఆధారపడి వుండడానికి ఇప్పుడు అవకాశం ఏర్పడింది. సామ్రాజ్యవాదం ఎదురులేని పెత్తనం సాగించిన రోజులు వెళ్లిపోయాయి. అక్టోబరు విప్లవం వచ్చిన తర్వాత తొలిదశాబ్దాల పరిస్థితికి, ఇప్పటి పరిస్థితికి చాలా మార్పువుంది. అప్పుడు మన సోవియట్ దేశం ఒక్కటే: ఇప్పటికన్నా అప్పుడు చాల బలహీనంగా వుంది. మన కాలంలో ప్రపంచ శక్తుల బలాబలాలు పూర్తిగా మారిపోయాయి. అందువల్ల ఇప్పుడు యుద్ధం అనివార్యమని చెప్పడమంటే, సోషలిజం శక్తుల్లో నమ్మకం లేదని చెప్పడమన్నమాట, నిరాశా నిస్పృహలలో పడడమన్న మాట.

'తమ విప్లవతత్వానికి' నిదర్శనంగా, యుద్ధం అనివార్యమని పదే పదే అంతులేకుండా ఎవరైనా చెప్పుకోవచ్చు. వాస్తవానికి ఈ వైఖరి తమ 'విప్లవతత్వంలో' విశ్వాసం లేకపోవడాన్ని సూచిస్తుంది. వాస్త

వానికి ఈ వైఖరి, తమ బలంలో విశ్వాసం లేకపోవడాన్ని, సామ్రాజ్య వాదమంటే భయాన్ని మాత్రమే సూచిస్తుంది.

సామ్రాజ్యవాద కూటమిలో నిరాయుధీకరణను వ్యతిరేకించే బలీయమైన శక్తులు ఇప్పటికీ వున్నాయి. కాని సరిగా ఈ శక్తులు తిరోగమించేట్లు ఒత్తిడి చేయడానికే మనం, వారిపై ప్రజల ఆగ్రహాన్ని రేకెత్తించాలి; ప్రజాభీష్టాన్ని వారు మన్నించేటట్లు చేయాలి.

ప్రజలకు నిరాయుధీకరణ కావాలి. ఇందుకోసం ప్రజల పోరా టాన్ని సంఘటితపరచి అగ్రగామిదళంగా వుండేదీ కమ్యూనిస్టులేనని ప్రజలు విశ్వసిస్తున్నారు.

నిరాయుధీకరణకై మన పోరాటం ఏదో అవసరంకోసం వేసే ఎత్తుగడ కాదు. మనం హృదయపూర్వకంగానే నిరాయుధీకరణను కోరు తున్నాం. మనం ఈ విషయంలో మార్క్సిజం-లెనినిజానికి పూర్తిగా కట్టుబడివున్నాం. గత శతాబ్దం చివరనే ఫ్రెడరిక్ ఏంగెల్సు, నిరాయుధీ కరణ సాధ్యమని చెప్పారు. అది 'శాంతికి హామీ' అని ఆయన చెప్పారు. మన కాలంలో నిరాయుధీకరణ నినాదాన్ని ఆచరణలో సాధింప వీలైన లక్ష్యంగా మొదట వి. ఐ. లెనిన్ చెప్పారు. సంపూర్ణ, లేదా పాక్షిక నిరాయుధీకరణకై 1922 లోనే జినోవా సమావేశంలో మొదటి సోవియట్ ప్రతిపాదనలను సమర్పించడం జరిగింది. అది జరిగింది లెనిన్ జీవిత కాలంలోనే. ఆయనే నిరాయుధీకరణ ప్రతిపాదనలను రూపొందించారు.

నిరాయుధీకరణకై పోరాటం యుద్ధాన్ని నివారించడానికి అత్యంత ముఖ్యమైన అంశం. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, అది బలప్రద మైన పోరాటం. ఈ పోరాటంలో, మానవజాతిలో అత్యధిక భాగం సోషలిస్టు శిబిరం వైపు వుంది.

అంతర్జాతీయ పరిస్థితిని బాగుచేయుటకూ 'ప్రచ్ఛన్న యుద్ధాన్ని' అంతం చేయడానికీ, ఇతర సోషలిస్టు లనుసరించే విధానానికి వ్యతిరేకంగా చైనావారు 'కత్తికి కత్తి' అన్న నినాదాన్ని లేవ్చారు. ఈ నినాదం ఆచరణలో, మానవజాతికి యుద్ధపుటంచుకు తెచ్చే సామ్రాజ్యవాద విధానానికి దోహదం చేస్తుంది. ఆయుధపోటీ కావాలనేవారికి తోడ్పడు తుంది.

అంతర్జాతీయ ఉద్రిక్తతను, ముఖ్యంగా అమెరికా, సోవియట్ యూనియన్ దేశాలమధ్య ఉద్రిక్తతను అట్టిపెట్టి ఉధృతంచేయడం తమకు లాభదాయకమని చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు భావిస్తున్నారనే అభిప్రాయం కలుగుతుంది. సోవియట్ యూనియన్, కవ్వింపు చర్యలకు కవ్వింపు చర్యలతో సమాధానం చెప్పాలనీ, సామ్రాజ్యవాద కూటమికి చెందిన "ఉన్మాదులు" వేసిన వలలో పడాలనీ, దుస్సాహసమూ, దురాక్రమణతత్వమూ విషయాల్లో పోటీ పడమని, సామ్రాజ్యవాదులు చేసే సవాలుకు సోవియట్ యూనియన్ ఆమోదించాలనీ – అంటే శాంతిని కాపాడడంలో గాక, యుద్ధాన్ని ప్రారంభించడంలో పోటీపడాలనీ వారు విశ్వసిస్తున్నట్లు కన్పిస్తుంది.

ఈ మార్గాన్ని అనుసరించడమంటే, శాంతికీ, ప్రజల భద్రతకూ భంగం కలిగించడం అన్నమాట. ప్రజల ప్రయోజనాలను ప్రియతమంగా ఎంచే కమ్యూనిస్టులు ఈ మార్గాన్ని ఎన్నడూ అనుసరించరు.

సామ్రాజ్యవాదానికి, సామ్రాజ్యవాదం తెచ్చిపెట్టే కొత్త యుద్ధాలకు, వలస దేశాల్లో సామ్రాజ్యవాదుల దురాక్రమణ చర్యలకూ, విదేశ భూభాగాల్లో సామ్రాజ్యవాదుల సైనిక స్థావరాలకూ, ఆయుధపోటీ మొదలగువాటికి వ్యతిరేకంగా ప్రజలు సాగించే పోరాటరూపాల్లో శాంతి కోసమూ, విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాలమధ్య శాంతియుత సహజీవన సూత్రాల అమలుకై సాగించే పోరాటం అత్యంత ముఖ్యమైన రూపం. కార్మికవర్గమూ శ్రామిక ప్రజల ప్రయోజనాలకోసమే ఈ పోరాటం. ఈ విధంగా చూసినపుడు, ఇది వర్గ పోరాటం.

అణు, ఉదజని బాంబులు పడడం ప్రారంభించేవరకూ ఆగకుండా, నూతన ప్రపంచ యుద్ధ ప్రమాదానికి వ్యతిరేకంగా పోరాటాన్ని పెంపొందించాలని కమ్యూనిస్టు, కార్మికపార్టీల ప్రకటన నిర్ధారణ. మన పార్టీ, తదితర సోదర పార్టీలూ ఆ నిర్ధారణను జ్ఞాపకముంచుకున్నాయి. అవి తమ కార్యక్రమంలో ఈ నిర్ధారణను మార్గదర్శకంగా పెట్టుకున్నాయి. ఈ పోరాటాన్ని ఇప్పుడు సాగించాలి. దినదినమూ ఈ పోరాటాన్ని ఉధృతంచేయాలి. ప్రధాన విషయమేమంటే, సకాలంలో దురాక్రమణదారులను అణచివేయడం, యుద్ధాన్ని నివారించడం, యుద్ధ ప్రారంభాన్ని కూడా నివారించడం.

నేడు శాంతికోసం పోరాడటమంటే అర్థం, అత్యంత జాగరూకతతో ఉండడమూ; సామ్రాజ్యవాద విధానాన్ని నిర్విరామంగా బట్టబయలు చేయడమూ; యుద్ధ ప్రేరేపకుల కుతంత్రాలనూ, పన్నాగాలనూ మెలకువతో కనిపెడుతూండడమూ; యుద్ధ విధానాన్ని అనుసరించే వారిపట్ల ప్రజల పవిత్ర కోపాగ్నిని రగులు కొల్పడమూ, సకల శాంతిశక్తుల నిర్మాణాన్ని పెంపడమూ; శాంతిరక్షణకై నిరంతరం ప్రజా చర్యను తీవ్రతరం చేయడమూ; కొత్తయుద్ధాల్లో ఆసక్తిలేని అన్ని దేశాలతోనూ సహకారాన్ని బలవత్తరం చేయడమూ సున్నమాట.

శాంతీ, శాంతియుత సహజీవనముకై సాగించే పోరాటం సామ్రాజ్యవాద సంఘటనను బలహీన పరుస్తుంది; సామ్రాజ్యవాదం యొక్క పచ్చి దురాక్రమణ వర్గాలను ప్రజలనుండి వేరు చేస్తుంది; కార్మికవర్గంయొక్క విప్లవ పోరాటమూ, ప్రజల జాతీయ విముక్తి పోరాటమూ పురోగమించడానికి తోడ్పడుతుంది.

శాంతీ, శాంతియుత సహజీవనములకై సాగించే పోరాటం, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగించే విప్లవకర పోరాటంలో ఒక అంగం. 81 దేశాల కమ్యూనిస్టుపార్టీల ప్రకటన ఈ విషయం గురించి యిలా చెప్పింది: "శాంతియుత సహజీవన పరిస్థితుల్లో పెట్టుబడిదారీ దేశాల్లో వర్గపోరాటాలకు అనుకూలమైన అవకాశా లేర్పడాయి; వలస, పరాధీన దేశాల్లో ప్రజల జాతీయ విముక్తి ఉద్యమానికి అనుకూలమైన అవకాశాలేర్పడ్డాయి. ఈ విప్లవ వర్గ పోరాట విజయాలూ, జాతీయ విముక్తి ఉద్యమ విజయాలూ, శాంతియుత సహజీవనాన్ని బలవత్తరం చేస్తాయి."

శాంతియుత సహజీవన పరిస్థితుల్లో ఇటీవలి సంవత్సరాల్లో శ్రామికవర్గం యొక్క వర్గపోరాటాల్లోనూ, ప్రజల జాతీయ స్వాతంత్ర్య పోరాటంలోనూ ముఖ్యమైన నూతన విజయాలు లభించాయి. ప్రపంచ విప్లవక్రమం జయప్రదంగా అభివృద్ధి పొందుతున్నది.

అందువల్లనే, విభిన్న సాంఘిక వ్యవస్థలుగల దేశాలమధ్య శాంతియుత సహజీవనానికై సాగించే పోరాటాన్ని, చైనా కామ్రేడ్స్ చేసినట్లుగా సామ్రాజ్య వాదమునకూ, వలస విధానానికీ వ్యతిరేకంగానూ, స్వాతంత్ర్యమూ, సోషలిజం కోసం సాగించే విప్లవ పోరాటాన్నుండి వేరు

చేయడమూ, వాటిని పోటీ పెట్టడమూ, అంటే అర్థం ఇది: శాంతియుత సహజీవనం అనే సూత్రాన్ని కేవలం మాట మాత్రంగానే అట్టిపెట్టడమూ, అర్థరహితంచేసి, ఆచరణలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా దృఢమైన పోరాటం సాగించవలసిన ఆవశ్యకతను విస్మరించడం. ఇది సామ్రాజ్య వాదులకు మాత్రమే లాభం.

చైనా కమ్యూనిస్టుపార్టీ తన జూన్ 14 లేఖలో యితర కమ్యూనిస్టు పార్టీలపై యీ విధంగా ఆరోపించింది. విభిన్న వ్యవస్థలు గల దేశాల మధ్య శాంతియుతసహజీవనాన్ని దోపిడీదారులకూ, దోపిడికి గురిఅయ్యేవారికి మధ్య గల సంబంధాలకూ, పీడితవర్గాలకూ పీడించే వర్గాలకు మధ్యగల సంబంధాలకూ విస్తరింపచేస్తున్నారనీ, సామ్రాజ్యవాదులకూ శ్రామికప్రజలకూ మధ్య గల సంబంధాలకూ విస్తరింపజేస్తున్నట్లు ఆరోపణ. కార్మికవర్గం పెట్టుబడిదారీ వర్గంతో జరిపే వర్గపోరాటాల్లో కార్మికవర్గాలకి సోదరపార్టీలు నాయకత్వం వహిస్తున్నాయి. విప్లవ పోరాటాన్ని ఎల్లప్పుడూ బలపరుస్తున్నాయి. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా విముక్తి కోసం జరిపే న్యాయమయిన యుద్ధాలను ఎల్లప్పుడూ బలపరుస్తున్నాయి. అటువంటి సోదర పార్టీలపై ఇది నిజంగా దారుణమైన అభూత కల్పనా, అపనిందానూ.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, తదితర సోదర పార్టీలపై చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు జరిపే పోరాటంలో, వారు అన్నిరకాల మాయోపాయాలకు దిగవలసి వచ్చినంత బలహీనంగా వారి వాదన యున్నాయి.

ఆధారంలేని వైఖరులను వారు స్వంతంగా కనిపెట్టి, వాటిని మాకు మొదట అంటగట్టి, ఆ తర్వాత మమ్మల్ని నిందించి, ఈ వైఖరులను బట్టబయలు చేయడంద్వారా మాతో పోరాడుతున్నారు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, తదితర సోదర పార్టీలూ విప్లవాన్ని విడనాడాయనీ, వర్గపోరాటం స్థానే శాంతియుత సహజీవనాన్ని ప్రవేశపెట్టాయనీ వారు అర్థరహితంగా ఆరోపించడం సరిగ్గా యింతే.

శాంతియుత సహజీవనం పెట్టుబడిదారీ దేశాలకూ, సోషలిస్టు దేశాలకూ మధ్య ప్రభుత్వ సంబంధాలకే వర్తిస్తుంది. ఈ విషయం రాజకీయాలను అధ్యయనం చేసే ఏ గ్రూపుకైనా సువిదితం. సహజంగానే శాంతియుత సహజీవన సూత్రాన్ని పెట్టుబడిదారీదేశాల్లో శత్రువర్గాల

మధ్య ఉండే సంబంధాలను ఏ విధంగానూ విస్తరింప చేయరాదు; కార్మిక వర్గం తన వర్గప్రయోజనాలకోసం బూర్జువావర్గంతో సాగించే పోరాటానికి వలస వాదులకు వ్యతిరేకంగా పీడిత ప్రజలు సాగించే పోరాటానికి ఈ సూత్రాన్ని విస్తరింపచేయడం అనుమతింపరానిది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సిద్ధాంతంలో శాంతియుత సహజీవనాన్ని దృఢసంకల్పంతో వ్యతిరేకిస్తూంది. మార్క్సిస్టు-లెనినిస్టులమని భావించేవారందరూ తప్పని సరిగా గుర్తించవలసిన సత్యం యిది.

# 3

సోవియట్ కమ్యూనిస్టుపార్టీతోనూ, ఇతర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల తోనూ, చైనా కమ్యూనిస్టుపార్టీకి మధ్య స్టాలిన్ వ్యక్తిపూజ దుష్ఫలితాలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం విషయంలో తీవ్రమైన అభిప్రాయ భేదాలున్నాయి.

వ్యక్తి పూజను సమర్థించడం, స్టాలిన్ తప్పుడు భావాలను వ్యాపింప చేయడం తమ బాధ్యతగా చైనా కమ్యూనిస్టు నాయకులు తమంతట తామే స్వీకరించారు. వ్యక్తిపూజ ఉవ్వెత్తుగా సాగుతున్న దశలో అమలు జరిగిన సిద్ధాంతాలను, నియమాలను, నాయకత్వ రూపాలను, పద్ధతులను ఇతర పార్టీలపై రుద్దాలని వారు ప్రయత్నించుతున్నారు. ఇది కీర్తిగౌరవాలను ఏమాత్రం చేకూర్చనట్టి అప్రతిష్ఠాకరమైన పాత్ర మాత్రమేనని వారికి స్పష్టంగా చెప్పదలచుకున్నాం. మార్క్సిస్టు-లెనినిస్టులను, అభ్యుదయ పరులైన ప్రజలను ఒప్పించి, వ్యక్తిపూజను సమర్థించే పంథాను అనుస రించేలా చేయడం ఎవరికీ సాధ్యంకాదు.

వ్యక్తిపూజ దుష్ఫలితాలను తొలగించడంలో క్రుశ్చేవ్ నాయకత్వాన మన పార్టీ, దాని కేంద్రకమిటీ చూపిన ధైర్యసాహసాలను, నిజమైన లెనినిస్టుసూత్రాలను అనుసరించడంలో ప్రదర్శించిన పట్టుదలను సోవియట్ ప్రజలూ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమమూ చాలా హర్షించాయి.

శ్రామిక ప్రజల మహత్తర శక్తులకు సంకెళ్లుగా తయారైన విపరీత భారాన్ని తొలగించడం ద్వారా, సోవియట్ సమాజం మరింత త్వరగా అభివృద్ధిచెందేందుకై మనపార్టీ యీ పని చేసిందని ప్రతివారికీ

తెలుసు. లెనిన్ మహాశయుడు మనకు అందజేసిన సోషలిజం ఆశయాల పవిత్రతను కాపాడేందుకూ, వ్యక్తిగత అధికారమూ, నిరంకుశత్వమూ అమలు జరిగే అవకాశమున్నవనే నిరుడను వాటికి లేకుండాచేయడానికీ, మన పార్టీ యిది చేసింది. వ్యక్తిపూజ ధోరణివల్ల సంభవించిన విషాద ఘటనలు పునరావృతమయ్యే అవకాశం లేకుండా జాగ్రత్త వహించేటందుకు, మన అనుభవాలనుంచి, సోషలిజం కొరకు పోరాడే యోధులందరూ గుణపాఠాలు తీసుకునేందుకు మనపార్టీ యీ పనిచేసింది.

మార్క్సిజం-లెనినిజానికి విరుద్ధమైన పూజకూ, ప్రమాదకరమైన దాని దుష్ఫలితాలకూ వ్యతిరేకంగా సాగిన పోరాటాన్ని యావత్తు కమ్యూనిస్టు ఉద్యమం సరిగానే అర్థం చేసుకొంది; బలపరచింది. ఒకప్పుడు చైనా నాయకులుకూడా ఆమోదించారు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఇరువదవ మహాసభ నిర్ణయాలకు అంతర్జాతీయంగా వున్న గొప్ప ప్రాముఖ్యతను గురించి వారు ఉద్ఘాటించారు.

1956 సెప్టెంబరులో చైనా కమ్యూనిస్టుపార్టీ ఎనిమిదవ మహాసభను ప్రారంభిస్తూ కామ్రేడ్ మావో-సె-టుంగ్ యిలా అన్నారు: 'లెనిన్ ఆదేశాలకు అనుగుణంగా సోవియట్ కామ్రేడ్స్, సోవియట్ ప్రజలు ప్రవర్తించారు. కొద్దికాలంలోనే వారు మహత్తర విజయాలను సాధించారు. ఈ మధ్యనే జరిగిన సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ ఇరవయ్యో మహాసభ, పార్టీ కార్యకలాపాల్లోని బలహీనతలను ఖండింపటంతోపాటు చాల సరైన రాజకీయవిధానాలను రూపొందించింది. భవిష్యత్తులో వారి కృషి చాల గొప్పగా అభివృద్ధి చెందుతుందని గట్టిగా చెప్పవచ్చును.'

చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ తరఫున మహాసభకు నివేదించిన రాజకీయ రిపోర్టులో కామ్రేడ్ లిషావ్-చీ అదే అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ యింకా ఇలా అన్నారు :

"ఈ సంవత్సరం ఫిబ్రవరిలో జరిగిన సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభకు ప్రపంచవ్యాపితంగా అత్యంత రాజకీయ ప్రాముఖ్యతవుంది. అది బృహత్తరమైన ఆరవ పంచవర్ష ప్రణాళికను రూపొందించడమేగాక, సోషలిజం లక్ష్యం మరింత అభివృద్ధి చెందడానికి దోహదంచేసే అత్యంత ప్రాముఖ్యంగల రాజకీయ విధానాలను

రూపొందించింది; పార్టీలో తీవ్ర దుష్ఫలితాలకు కారణమైన వ్యక్తిపూజ ధోరణిని ఖండించింది; శాంతియుత సహజీవనం, అంతర్జాతీయ సహకారం యింకా పెంపొందించడానికి ప్రతిపాదనలు చేసి అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలించడంలో గొప్ప సేవ చేసింది."

చైనా కమ్యూనిస్టుపార్టీ ఎనిమిదవ మహాసభలోనే పార్టీ నిబంధనావళికి సవరణలను సూచించుతూ కామ్రేడ్ టెంగ్ సియావో-పింగ్ తమ నివేదికలో ఇలా అన్నారు :

"అన్ని ముఖ్య సమస్యలమీద నిర్ణయాలు చేసేటపుడు పార్టీలో వ్యక్తిగతంగా కాక సమిష్టిగా వ్యవహరించాలని లెనినిజం నిర్ధారణ చేస్తోంది. వ్యక్తి పూజకు వ్యతిరేకంగా పోరాటం సాగించవలసిన అవసరాన్ని గురించి, సమిష్టినాయకత్వ సూత్రాన్ని ఖచ్చితంగా అమలు జరుపవలసిన ప్రాముఖ్యాన్ని గురించి సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ చేసిన నిర్ణయాలు ఎంతో విశ్వసనీయంగా వున్నాయి. అవి సోవియట్ పార్టీకి అత్యంత ప్రాముఖ్యమైనవిగా వుండటంతోపాటు, ప్రపంచ దేశాలన్నిటిలోని కమ్యూనిస్టు పార్టీలపై గొప్ప ప్రభావం కలిగి వుంటాయి."

1956 డిసెంబరులో జెన్‌మిన్ జిహోవ్ పత్రికలో చైనా కామ్రేడ్స్ "కార్మిక నియంతృత్వ చారిత్రక అనుభవాలపై మరొకసారి" అనే శీర్షికతో ప్రసిద్ధమైన సంపాదకీయాన్ని వ్రాశారు. (డిసెంబరు 1956). అందులో ఇలా వుంది :

"స్టాలిన్ వ్యక్తిపూజా ధోరణిని తొలగించడంలోనూ, స్టాలిన్ తీవ్రమైన తప్పిదాలను బట్టబయలు చేయడంలోనూ, స్టాలిన్ పొరపాట్లవల్ల వచ్చిన దుష్ఫలితాలను రద్దుచేయటంలోనూ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ గొప్ప కృత నిశ్చయాన్ని, ధైర్యాన్ని ప్రదర్శించింది. ప్రపంచంలోని మార్క్సిస్టు-లెనినిస్టు లందరూ, కమ్యూనిజాన్ని అభిమానించే వారంతా, పొరపాట్లను సరిదిద్దడానికి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చేస్తున్న కృషిని బలపరుస్తారు; సోవియట్ కామ్రేడ్స్ ప్రయత్నాలు సంపూర్తిగా విజయం పొందుతాయని ఆశించుతారు."

వాస్తవంగా అలాగే జరిగింది.

చైనా నాయకుల యీ పై అభిప్రాయాలను, జూన్ 14 వ తేదీన చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ లేఖలోని అభిప్రాయాలకు ఎలాంటి పోలికలేదని నిష్పాక్షికంగా చూసే వారెవరికైనా, 20 వ మహాసభ నిర్ణయాలను అంచనా వేయడంలో పూర్తిగా వారు వెనక్కి తిరిగారని తేటతెల్లమవుతుంది.

కాని ఇలాంటి సిద్ధాంత సమస్యల్లో వూగిసలాడటం, మాటిమాటికి మారుతూ వుండటం సబబేనా? కాదు. అలా చేయడం సమర్థనీయంకాదు. ఇదివరలో చైనా నాయకులకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీతో ఈ సమస్యలమీద విభేదాలు లేకుండా వుండాలి, లేదా యీ ప్రకటనలన్నీ అబద్ధమైనా అయి వుండాలి.

సత్యమేదో నిరూపించడానికి ఆచరణే సర్వత్రా శ్రేష్ఠమైనది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 20, 21, 22 మహాసభలు నిర్ణయించిన పంథాను ఆచరణలో పెట్టడంద్వారా మా దేశ ప్రజాజీవితంలో సాధించిన అద్భుత ఫలితాలే ఆచరణలో ఆ పంథా సరైనదని రుజువుచేస్తున్నాయి. పార్టీ జీవితంలో, లెనినిస్టు సూత్రాలను నిబంధనలను పునరుద్ధరించి, నూతన పంథాను ఆచరణలోపెట్టిన గత పదేళ్ళలోనూ సోవియట్ సమాజం ఆర్థికంగా గొప్ప విజయాలను సాధించింది: శాస్త్రీయ విజ్ఞానంలోనూ, సంస్కృతిలోనూ, ప్రజాక్షేమాన్ని పెంచడంలోనూ. రక్షణశక్తిని పెంపొందించుకోడంలోనూ, విదేశాంగ విధానంలో విజయాలు సాధించడంలోనూ అద్భుత ఫలితాలు చేకూరాయి.

వ్యక్తిపూజ దశలో ప్రజా జీవితాన్ని విషపూరితం చేసిన, భయ సందేహాలతో కూడిన వాతావరణం, సందిగ్ధావస్థ గతించిపోయింది. సోవియట్ ప్రజలు యిదివరకటికంటే సుఖంగా జీవించుతున్నారనే, సోషలిజం సత్ఫలితాలను అనుభవించుతున్నారనే సత్యాన్ని నిరాకరించడం అసంభవం. నివసించేందుకు కొత్త ఇల్లు కేటాయించబడిన కార్మికుని (అలాంటివారు అనేకలక్షలమంది వున్నారు!) అడిగితే నిజం తెలుస్తుంది. వృద్ధాప్యంలో జీవితావసరాలు గ్యారంటీ చేయబడిన పెన్షన్‌దారుని అడిగితే తెలుస్తుంది. పరిస్థితి యిపుడెంతో మెరుగైన సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోని రైతులను అడిగితే తెలుస్తుంది. అలాగే గతంలో వ్యక్తిపూజ దశలో నిర్బంధాలకు గురయి, ఎన్నో బాధలుపడి, ఇపుడు స్వాతంత్ర్యం

పేరు ప్రతిష్టలు అనుభవించుతున్న లక్షలకొలది పౌరుల్ను అడిగితే నిజం తెలుస్తుంది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22వ మహాసభ లెనినిస్టు పంథా విజయంవల్ల ఆచరణలో సోవియట్ ప్రజలకు కలిగిన మేలు ఏమిటో అర్ధమవుతుంది.

వ్యక్తిపూజ దశలో హింసాకాండకు బలియైపోయిన తలిదండ్రులు కలిగిన వారిని అడగండి: తమ తండ్రులు, తల్లులు, సోదరులు నిజాయితీ పరులేననీ, తాము సమాజాన్నుంచి వెలివేయ బడినవారు కారనీ, సోవియట్ మాతృభూమి అనుంగుబిడ్డలేననీ గుర్తించ బడినందుకు వారెంత ఆనందం హొందుతున్నారో తెలుసుకొండి.

పరిశ్రమలు, వ్యవసాయం, సంస్కృతి, విజ్ఞానం, కళలు-ఎటువైపు దృష్టి సారించినా సత్వరాభివృద్ధి మనకు గోచరించుతుంది. మన అంతరిక్ష నౌకలు అంతరాళంలోకి యాత్రలు సాగించుతున్నాయి. సోవియట్ ప్రజలను సరైన పంథాలో మన పార్టీ నడుపుతోందని యివన్నీకూడా బాగా నిరూపించుతున్నాయి.

ఐతే సోవియట్ పౌరుని జీవితం మెరుగుపరచడానికి చేయవలసిందంతా చేసివేశామని మనం చెప్పజాలేము. ఈ సూత్రం గమ్యస్థానం చేరడం కేవలం మన వాంఛలపైనే ఆధారపడదేవని సోవియట్ ప్రజలకు తెలుసు. సమస్త వస్తు సముదాయానికి నిలయమైన కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించుకోవలసి వుంది. అందుకొరకే భౌతిక విలువలను, ఆధ్యాత్మిక విలువలను, త్వరగా సృష్టించడానికి మన ప్రజలు కష్టపడి పని చేస్తున్నారు. కమ్యూనిస్టు విజయాన్ని దగ్గరకు తేడానికి కృషిచేస్తున్నారు. మనం సరైన మార్గాన్నే అనుసరించుతున్నామనీ, మన అభివృద్ధి అవకాశాలను మనం స్పష్టంగా చూస్తున్నామనీ ప్రతివారికి తేటతెల్లమవుతుంది.

కమ్యూనిజం నిర్మాణానికి వివరమైన ప్రణాళికను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం రూపొందించింది. దానిని అమలుజరపడం ద్వారా సోవియట్ ప్రజలు అత్యున్నత జీవనస్థాయి నందుకుంటారు: "ప్రతివారు తమ శక్తికొలదీ పనిచేయడం, అవసరం కొలదీ అనుభవించడం" అనే కమ్యూనిస్టు సూత్రం క్రమంగా అమలుజరిగే శుభదినాలు వస్తాయి.

కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి మహత్తర ప్రణాళికను తయారు చేసిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమాన్ని చైనా కామ్రేడ్స్ వక్రంగా చిత్రించడం సోవియట్ ప్రజలకు ఆశ్చర్యంగానూ, ఊహాతీతంగానూ గోచరించుతూంది.

ప్రజలకు సుఖప్రదమైన జీవితం కొరకు పోరాటం కర్తవ్యంగా మనపార్టీ నిర్దేశించడం ఒక విధమైన "బూర్జువా మనస్తత్వం"గానూ, సోవియట్ సమాజం "పతనావస్థ"కు చిహ్నంగానూ చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకులు చిత్రించుతున్నారు. వారి హేతువాదం ప్రకారం బెరడు చెప్పులు తొడుక్కోవడం, ఉమ్మడి మట్టిపాత్రనుంచి పలచటి గంజి త్రాగడం కమ్యూనిజం కాబోలు! శ్రమించే కార్మికుడు సుఖంగా జీవించడమంటేనూ, భవిష్యత్తులో అంతకంటే బాగా జీవించాలని కోరుకుంటేనూ అది దాదాపు పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించడమే కాబోలు!

ఈ తత్త్వశాస్త్రాన్ని మార్క్సిజం-లెనినిజంలో అత్యంత ఆధునిక దివ్యసందేశంగా వారు మనకు బహూకరించుతున్నారు. అలాంటి "సిద్ధాంతాల" రచయితలకు, ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకుని స్వంత సోషలిస్టు రాజ్యాంగాన్ని నిర్మించుకున్న కార్మికవర్గ శక్తిసామర్థ్యాలమీద నమ్మకం లేదని సుస్పష్టమవుతోంది.

మన దేశ చరిత్రను పరిశీలించితే, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమాన్ని గమనించితే లెనిన్ నాయకత్వాన అధికారం హస్తగతం చేసుకున్నప్పుడు మనమేవిధంగా ప్రారంభించామో, సోవియట్ ప్రజలు ఏ ఉన్నత శిఖరాలను చేరుకున్నారో సులభంగానే అవగాహన అవుతుంది. మనదేశమిపుడు గొప్ప సోషలిస్టు రాజ్యంగా తయారయింది; పారిశ్రామికోత్పత్తిలో సోవియట్ యూనియన్ నేడు యూరపు ఖండమంతటిలోకి ప్రథమస్థానంలో వుంది. ప్రపంచంలో రెండోదిగా వుంది. కొలది కాలంలోనే అమెరికాను అధిగమించి, ప్రథమ స్థానానికి రాబోతుంది. సోవియట్ కార్మికవర్గం, సోవియట్ సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతాంగము, సోవియట్ మేధావులు మన విజయాలన్నిటికీ సృష్టికర్తలు.

సోవియట్ ప్రజలేకాక ఇతర సోషలిస్టుదేశాల ప్రజలుకూడ తమ శ్రమశక్తితో గొప్ప విజయాలను సాధించగలరనే విశ్వాసం మనకుంది. కార్మికవర్గాన్ని, రైతాంగాన్ని సరైన పంథాలో నడిపించితే, వాస్తవిక దృష్టితో

ఆలోచించి శ్రామిక ప్రజల శక్తి సామర్థ్యాలను సరిగా వినియోగించే నిర్ణయాలను చేస్తే మహత్తర ఫలితాలను సాధించగలుగుతారు.

వ్యక్తిపూజా ధోరణిని సమర్థించే ప్రయత్నంలో చైనా నాయకులు తమ లేఖనిండా సోవియట్ యూనియన్లో వర్గపోరాటాలను గురించి ప్రస్తావించారు; సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమంలో యావత్తు ప్రజల ప్రభుత్వమనీ, యావత్తు ప్రజల పార్టీ అని ఉదహరింపడం మార్క్సిజానికి పూర్తిగా విరుద్ధమని అధిక్షేపించారు.

ఈ జాబులో వారి వాదనలన్నిటినీ వివరంగా పరిశీలన చేయాలని మేము ఉద్దేశించలేదు. చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ వ్రాసిన జూన్ 14వ తేదీ లేఖను పదివిన వారెవరికైనా నిస్సందేహంగా ఒక విషయం ద్యోతకమవుతుంది: సోవియట్ ప్రజల జీవితానికి పూర్తిగా దూరంగా వుండి, ఏమీ తెలియని నిస్సహాయస్థితిలో చైనా పార్టీ కేంద్ర కమిటీ ఇలాంటి వాదనను చేస్తూంది అని బోధపడుతుంది; సోవియట్ సమాజంలో పరస్పరం విరుద్ధ ప్రయోజనాలుగల శత్రువర్గాలున్నాయని వారు మనకు బోధించుతున్నారు. అందుచేత శ్రామిక నియంతృత్వం యొక్క అవసరముందంటున్నారు. ఈ వర్గాలు ఏమిటి? చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ లేఖ ప్రకారం 'బూర్జువా మోసగాళ్లు, పరాన్నభుక్కులు, ధొంగవ్యాపారులు, దగాకోర్లు, సోమరులు, రౌడీలు, దొంగలు' యివి.

వర్గాలను గురించి, వర్గ పోరాటాలను గురించి చైనా కామ్రేడ్స్‌కు మౌలికమైన అవగాహనే వుంది. పరాన్నభుక్కులైన వ్యక్తులను ఒక వర్గంగా ఎప్పటినుంచి పరిగణించుతున్నారు? అది ఎలాంటి వర్గం? సోమరుల వర్గం, రౌడీల వర్గం, ప్రజల ఆస్తిని కాజేసే వర్గం, పరాన్నభుక్కుల వర్గం? ఏ సమాజంలోనూ నేరస్తులను ఒక వర్గంగా ఎంచడం జరుగలేదు. బడిపిల్లవాడికైనా సైతం ఈ సంగతి తెలుసు. సోషలిస్టు సమాజంలో కూడ ఇలాంటివారిని ఒక వర్గంగా పరిగణించడం జరగదు. పెట్టుబడిదారీ విధానం యొక్క అవశేషాలకు చిహ్నాలుగానే వీరిని పరిగణించాలిసి వుంటుంది.

అలాంటివారికి వ్యతిరేకంగా పోరాటం సాగించడానికి శ్రామికవర్గ నియంతృత్వం అవసరం లేదు. యావత్తు ప్రజల ప్రభుత్వం ఈ కర్తవ్యాన్ని నిర్వహించగలదు, నిర్వహించుతూంది. పార్టీ, కార్మిక సంఘాలు,

ఇతర ప్రజా సంస్థలు నిర్వహించే యితోధిక విజ్ఞాన ప్రచారం ద్వారానూ, ప్రజలందరి కృషిద్వారానూ. సోవియట్ రక్షకభటుల ఎక్కువ కృషి ద్వారాను ఇలాంటి నేరస్తులకు వ్యతిరేకంగా పోరాటం సాగించగలమని అనుభవం ద్వారా మనం తెలుసుకున్నాం.

ప్రస్తుత సోవియట్ సమాజంలో ప్రధానంగా రెండు వర్గాలు-కార్మికులు, రైతులు వున్నారు; మేధావులు కూడ వున్నారు. సోవియట్ సమాజంలోని ఏ ఒక్క వర్గమూ ఇతర వర్గాలను దోచుకునే పరిస్థితి లేనే లేదు. కాదనడానికి వీలులేని యదార్థం యిది. నియంతృత్వం వర్గ భావం: సోవియట్ యూనియన్లో శ్రామిక నియంతృత్వాన్ని ఎవరిపైన ప్రయోగించాలని చైనా కామ్రేడ్స్ ప్రతిపాదించుతారు? సమష్టి వ్యవసాయక్షేత్ర రైతాంగంపైనా? లేక మేధావులైన ప్రజలపైనా? సోషలిస్టు సమాజంలో కార్మిక వర్గమూ, రైతువర్గమూ కొంత మార్పు చెందాయి: వాటి మధ్య విభేదాలు, తేడాలు క్రమక్రమంగా తగ్గిపోతున్నాయి. ఎవరూ దీనిని కాదన లేరు.

సోషలిజం పూర్తి విజయం పొందిన తర్వాత కార్మికవర్గం తన నాయకత్వ పాత్రను శ్రామిక నియంతృత్వం ద్వారా నిర్వర్తించడం లేదు: సమాజంలో యిప్పటికీ అగ్రగామి వర్గంగా వుంటూ కమ్యూనిజం సమగ్ర నిర్మాణంలోనూ కార్మికవర్గం మార్గదర్శి పాత్రను నిర్వహించుతోంది. దశాబ్దాలుగా వర్గపోరాటంలోనూ, విప్లవానుభవంలోనూ ఆరితేరి పటుత్వం సంపాదించడంవల్లనూ, సోషలిస్టు సంపద అత్యున్నత రూపంతో ప్రత్యక్ష సంబంధం కలిగి వుండటంవల్లనూ, ఆర్థిక విధానంలో దాని స్థానంవల్లనూ కార్మికవర్గం అగ్రగామి పాత్రను వహించుతోంది.

పెట్టుబడిదారీ విధానంనుంచి కమ్యూనిజంకు పరివర్తన దశను గురించి కారల్ మార్క్స్ చెప్పిన మాటలను ఉల్లేఖించుతూ, చైనా కామ్రేడ్స్ ఈ పరివర్తన దశలో తప్పనిసరిగా శ్రామిక నియంతృత్వం వుండితీరాలిసిందేనని వాదించుతున్నారు. కాని మార్క్స్ ఈ విషయాన్ని ప్రస్తావించినపుడు ఆయన మనస్సులో కమ్యూనిజమంటే ఒకే ఒక సామాజిక, ఆర్థిక రూపంగా (అందులో, ప్రథమ దశ సోషలిజం) భావించి నందున, సోషలిస్టు విప్లవం శ్రామిక నియంతృత్వంలేకుండా కమ్యూనిజం లోకి పరివర్తన చెందడం అసంభవమన్నారు. కమ్యూనిజానికి ప్రథమ

సోషలిజం విజయం పొందాలంటే దోపిడీవర్గాల ప్రతిఘటనను ఓడించడానికి, సోషలిస్టు నిర్మాణాన్ని సంఘటిత పరచడానికి శ్రామిక నియంతృత్వ ఆవశ్యకతను నొక్కిచెబుతూ వి. ఐ. లెనిన్ అనేక సందర్భాలలో తేటతెల్లం చేశారు. దానినిబట్టి సోషలిజం విజయం పొందాక శ్రామిక నియంతృత్వం అవసరంవుండదని స్పష్టమవుతుంది. అపుడు మిత్రస్వభావంగల వర్గాలు, స్వభావంలో పూర్తిగా మార్పుచెందిన శ్రామిక ప్రజలు మాత్రమే సమాజంలో వుంటారు, అణచివేసేవారు ఎవ్వరూ వుండరు.

ఈ సమస్యలపై చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ లేఖలో లేవనెత్తిన కుహనా సిద్ధాంత వాదన లన్నిటికీ నిజమైన సారాంశం స్పష్టంగా యిది: సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధి చేయడానికి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ తీసుకున్న పంథాను, 20, 21, 22 పార్టీ మహాసభలు చేసిన నిర్ణయాలలోను, సోవియట్ పార్టీ కార్యక్రమంలోను నొక్కి చెప్పబడిన పంథాను చైనా కామ్రేడ్స్ వ్యతిరేకించుతున్నారు. పుష్కలంగా పదజాలంగలవారి జాబులో ఎక్కడా కూడా సోషలిజం పరిస్థితులలో, కమ్యూనిజం నిర్మాణ పరిస్థితులలో ప్రజాస్వామ్య పరిణామం గురించి ప్రస్తావనైనా లేకపోవడం ఊరకనే జరగలేదు.

వ్యక్తిపూజా ధోరణిని సమర్థించడంలో చైనా కామ్రేడ్స్ ఉద్దేశ్యాలేమిటో తీర్పుచెప్పడం చాల కష్టమవుతుంది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం చరిత్రలో మొదటిసారి వ్యక్తిపూజను బహిరంగంగా సమర్థించడం మనం చూస్తున్నాం. మన దేశంలో వ్యక్తిపూజా ధోరణి పూర్తిగా ఉచ్ఛదశలో వున్నపుడు సైతం స్టాలిన్ స్వయంగా, మాటల్లోనైనా, ఈ పెటీబూర్జువా ధోరణితో తనకేమీ సంబంధం లేదనీ, సోషలిస్టు రివల్యూషనరీల నుండి ఈ సిద్ధాంతం బయలుదేరిందనీ చెప్పవలసి వచ్చింది

వ్యక్తిపూజను సమర్థించడానికి మార్క్స్, లెనిన్ పేర్లు వినియోగించే ప్రయత్నాలు కేవలం ఆశ్చర్యాన్ని కలిగించుతాయి. మన పార్టీ పుట్టిన ప్రథమ దశలోనే "నాయక ప్రజలు, వీరులు అన్న నరోద్నిక్‌ల సిద్ధాంతాలను వ్యతిరేకించుతూ లెనిన్ బ్రహ్మాండమైన పోరాటం సాగించారు. లెనిన్ ఆధ్వర్యాన మన పార్టీ కేంద్ర కమిటీ, సోవియట్ ప్రభుత్వమూ నిజమైన సమష్టి నాయకత్వ పద్ధతులను అమలుజరిపాయి. లెనిన్

అసాధారణమైన సమర్థత కలిగిన వ్యక్తిగా వుంటూ తన విషయంలో కొద్ది పాటి తాబేదారీతనాన్ని, బానిసత్వాన్ని కూడా ప్రదర్శించేవారిని నిర్దాక్షిణ్యంగా విమర్శించేవారు. చైనా కామ్రేడ్స్‌కు యీ విషయాలు నిజంగా తెలియవా ?

ఐతే వ్యక్తిపూజకు వ్యతిరేకపోరాటం సాగించడమంటే మన పార్టీ గాని, ఇతర మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలుగాని పార్టీ, ప్రభుత్వ నాయకుల అధికారానికి విరుద్ధంగా ఎన్నడూ భావించలేదు. 20, 22 మహాసభలతో సహా సోవియట్ పార్టీ పదేపదిగా నాయకత్వ అధికారాన్ని గౌరవింపుతామని నొక్కి చెప్పింది. వ్యక్తిపూజను నిరసించి దాని దుష్ఫలితాలకు వ్యతిరేకంగా పోరాడుతూ ప్రజల ప్రయోజనాలను ఎలుగెత్తి చాటిన వారిని, తమ శక్తినంతా ధారబోసి కమ్యూనిజం కొరకు పోరాడి ప్రతిష్ఠను పొందిన నాయకులకు గౌరవ మర్యాదలను చూపేది.

# 4

మేము భేదించే ముఖ్య విషయాలలో తర్వాతదిది; పెట్టుబడిదారీ దేశాలలోని శ్రామికవర్గం యొక్క విప్లవ పోరాట పద్ధతులూ, విధానాలూ, జాతీయ విముక్తి పోరాటాల పద్ధతులూ, విధానాలూ, మానవజాతి అంతా సోషలిజంలోనికి మార్పుచెందే మార్గాలు విషయమై మేము భేదిస్తున్నాం.

చైనా కామ్రేడ్స్ చెప్పినదానినిబట్టి ఈ సమస్యపై వున్న విభేదాలు ఇవి: ఒక పక్షం-అంటే తాము-ప్రపంచ విప్లవం రావాలంటారు. రెండో పక్షం-అంటే సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలూ-విప్లవాన్ని మరచిపోయారు. అదంటే 'భయ' పడుతున్నారు కూడా. విప్లవ పోరాటానికి బదులు, నిజమైన విప్లవకారులు 'తలపెట్టతగని' శాంతిని గురించీ, సోషలిస్టు దేశాల ఆర్థికాభివృద్ధిని గురించీ, ఆ దేశాల ప్రజల జీవనస్థాయిలు పెంచడం గురించీ, పెట్టుబడిదారీ దేశాల శ్రామిక ప్రజా సామాన్యం యొక్క ప్రధాన ప్రయోజనాలూ, ప్రజాతంత్ర హక్కులూ గూర్చిన పోరాటం గురించీ ఆదుర్దా ప్రకటించాయి.

చైనా కమ్యూనిస్టుపార్టీకీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికీ మధ్యనున్న అభిప్రాయభేదాలు నిజానికి మరొక స్థాయిలో వున్నాయి: చైనా కమ్యూనిస్టు నాయకులు అవసరంవున్నా, లేకపోయినా ప్రపంచ విప్లవం గురించి మాట్లాడుతూంటారు. "విప్లవాత్మక" - అనే పదాన్ని ఏ సందర్భంలో అయినా సరే-తరచు సందర్భశుద్ధి లేకుండానే వుపయోగిస్తారు. ఇంక చైనామిత్రులు విమర్శించే ఇతరులు విప్లవ సమస్యను ఎంతో జాగ్రత్తగా పరిశీలిస్తారు. వట్టి కబుర్లు చెప్పడంగాక గట్టిగా పని చేస్తారు. కమ్యూనిజం విజయానికి తోడ్పడే మంచి పంథాలను, ఈనాటి పరిస్థితులకు అనుగుణమైన వానిని కనుక్కొనేటందుకు ప్రయత్నిస్తారు. జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాతంత్రం, సోషలిజంకోసం గట్టిగా పోరాడుతారు.

ఈనాటి విప్లవోద్యమానికి సంబంధించిన సమస్యలమీద చైనా మిత్రుల ప్రధానాభిప్రాయా లెట్లా వున్నాయో పరిశీలిద్దాం.

"ప్రపంచ విప్లవం" పేరుతో శాంతికోసం పోరాటం మానాలనే వాదం, శాంతియుత సహజీవన విధానాన్నీ, శాంతియుత ఆర్థికపోటీ విధానాన్నీ నిరాకరించాలనీ, శ్రామిక ప్రజల ప్రధాన ప్రయోజనాలకోసమూ, పెట్టుబడిదారీ దేశాలలో ప్రజాతంత్ర సంస్కరణలకోసమూ పోరాడాలనే విధానాన్ని మానాలనీ చెప్పే వాదం, దేశాలూ వాని ప్రజలు సోషలిజం లోనికి మార్పు చెందడానికి అనుకూలమేనా? సోషలిస్టు దేశాలలోని కమ్యూనిస్టులు శాంతికోసం నిలబడ్డమూ, శాంతియుత సహజీవన విధానాన్ని అనుసరించడమూ వలన తమ్ము గురించి మాత్రమే ఆలోచిస్తున్నారనీ, పెట్టుబడిదారీ దేశాలలోని తమవర్గసోదరుల మాటే మరచిపోయారనీ అనవచ్చునా?

అణుయుద్ధానికి వ్యతిరేకంగా శాంతికోసం నేడు జరుగుతున్న పోరాటంయొక్క అర్థాన్ని బాగా ఆలోచించినట్లయితే సోవియటు కమ్యూనిస్టులూ, ఇతర సోషలిస్టు దేశాలలోని సోదరపార్టీలూ అనుసరిస్తున్న శాంతివిధానం శ్రామికవర్గానికీ, పెట్టుబడిదారీ దేశాలలోని శ్రమజీవి ప్రజలకూ ఎంతో సాయపడ్డాయని ఎవరికైనా తెలుస్తుంది. అణుయుద్ధం రాకుండా నిరోధించుటవలన శ్రామిక వర్గాన్నీ, మొత్తం దేశాల ప్రజలనూ, ఖండాలకు ఖండాలనే మృత్యువువాత పడకుండా కాపాడామనే

దొక్కటే కాదు. అదొక్కటే అయినా మా విధానం సరియైనదే అనడానికి సరిపడుతుంది.

మరొకకారణంకూడ వుంది. ఆ విప్లవాత్మక అంతర్జాతీయ శ్రామిక వర్గోద్యమం తన ప్రధాన వర్గగమ్యాలను సాధించడానికి ఈ విధానమే మంచిది. తాము సాధించుకొన్న శాంతిపరిస్థితులలో సోషలిస్టుదేశాలు ఆర్థికాభివృద్ధిలో అద్భుత విజయాలను సాధించడమూ, విజ్ఞాన-సాంకేతిక శాస్త్రాలలో అద్భుత విజయాలు పొందడమూ, ప్రజల జీవన స్థితినీ, పని పరిస్థితులనూ నిరంతరం అభివృద్ధి పరుస్తూండడమూ, సోషలిస్టు ప్రజాతంత్రాన్ని పెంచి వృద్ధి పొందించడమూ - ఇవి శ్రామికవర్గోద్యమానికి అనంత సహాయంకాదా ?

ఈ సాఫల్యాలనూ, విజయాలనూ చూసి పెట్టుబడిదారీ దేశాలలోని ప్రతి కార్మికుడూ-"పెట్టుబడిదారీ విధానంకన్న తాను ఉత్తమమని సోషలిజం క్రియలద్వారా నిరూపించింది, పోరాడి సంపాదించవలసిన వ్యవస్థ ఇది"-అంటాడు. పుస్తకాలద్వారా గాక, క్రియలద్వారా ఆదర్శంచూపి సోషలిజం నేడు ప్రజల మనస్సులనూ, హృదయాలనూ చూరగొంటూంది.

మానవజాతి అభివృద్ధిలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ప్రముఖ పాత్ర వహిస్తూండడం ఈనాటి ప్రధాన విస్పష్ట లక్షణం అని 1960 ప్రకటన చెప్తూంది. అంతర్జాతీయ శ్రామిక వర్గమూ, అది సృష్టించిన సోషలిస్టు ప్రపంచ వ్యవస్థా ఈ యుగంలో కీలకస్థానం వహిస్తున్నాయని 1960 సమావేశంలో పాల్గొన్న కమ్యూనిస్టు పార్టీలన్నీ ఏకాభిప్రాయం ప్రకటించాయి.

విప్లవోద్యమంయొక్క తతిమ్మా బాధ్యత లన్నింటి పరిష్కారం చాలావరకు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ దృఢపటిష్ఠతమీద ఆధారపడివుంది. అందుచేతనే-"ప్రపంచ పరిణామాలపై దేని పలుకుబడి పాత్ర ఏడాదికేడాదికీ పెరుగుతూన్నదో ఆ మహత్తర సోషలిస్టు దేశాల ప్రజల కుటుంబాన్ని నిర్విరామంగా బలపరచాల"ని కమ్యూనిస్టు-కార్మిక పార్టీలు దృఢప్రతిజ్ఞ తీసుకొన్నాయి. ఈ సర్వ ప్రథమ కర్తవ్యాన్ని పూర్తిచేయడం తన అతి ప్రధాన అంతర్జాతీయ కర్తవ్యంగా మా పార్టీ భావిస్తూంది.

"మన ఆర్థిక విధానంద్వారా ప్రపంచ విప్లవంమీద మన ముఖ్యమైన పలుకుబడిని వేస్తాం. ఈ రంగంలో పోరాటం ప్రపంచ పరివ్యాప్త

రూపంలో సాగుతుంది. ఈ కర్తవ్యాన్ని నిర్వహించినట్లయితే అంత ర్జాతీయంగా తిరుగులేని విధంగా, సుస్థిరంగా మనం విజయం పొందుతాం"- అని వి. ఐ. లెనిన్ అన్నారు. (లెనిన్ రచనలు, సంపుటం 32, పుట-413)

లెనిన్ మహాశయుని ఈ ఆదేశాన్ని సోవియట్ కమ్యూనిస్టులు బాగా ఆకళింపు చేసుకున్నారు. ఇతర సోషలిస్టుదేశాల కమ్యూనిస్టులు దానిని అనుసరించారు. అయితే వి. లెనిన్ చెప్పింది తప్పనే క్రామేడ్సు కొంత రీనాడు బయలు దేరారని తేలింది.

ఏమిటిది? సోషలిస్టుదేశాలు ఆర్థిక పోటీలో పెట్టుబడిదారీ దేశా లను ఓడించగలవనే విశ్వాసం లేనిపోవడమా? కాక సోషలిజాన్ని నిర్మించడంలో కష్టా లెదురయ్యేసరికి నిరుత్సాహపడిపోయి, తమ ఆర్థిక విజయాలతోనూ, తమదేశాలలో సోషలిజాన్ని విజయవంతంగా నిర్మించ డం ద్వారానూ ప్రపంచ విప్లవోద్యమంపైన పెద్దగా ప్రభావాన్ని వెయ్యగల మనే విశ్వాసాన్ని కోల్పోయిన వారి మనస్థితా? తాము దగ్గరమార్గం అనుకుంటున్న అడ్డదారులుపట్టి విప్లవాన్ని త్వరలో సాధించాలనుకుంటు న్నారు వారు. ప్రజల పనిద్వారా, ఒక్క దానిద్వారానే విజయవంతం అయిన విప్లవం తన విజయాలను దృఢపరచుకోగలదు. పెట్టుబడిదారీ విధానంకన్న సోషలిజం ఉత్తమమని నిరూపించగలదు, నిజమే. అది అంత సులభంకాదు. అభివృద్ధి పొందని ఆర్థిక వ్యవస్థగల దేశాలలో విప్లవాలు విజయం పొందినప్పుడు ఇదిమరీ కష్టం. ఈ పరిస్థితులలోనూ నాయకత్వం సరియైనది వుంటే గొప్ప గొప్ప విజయాలను సాధించవచ్చుననీ, పెట్టు బడిదారీ విధానంకన్న సోషలిజం ఉత్తమమనీ ప్రపంచానికంతకూ చూప వచ్చునని సోవియటు యూనియనూ, ఇతర సోషలిస్టు దేశాలూ తమ వుదాహరణలతో నిరూపించాయి.

అడిగాక పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గం యొక్క విప్లవ పోరాటాలకు ఎక్కువ అనుకూలమేది? శాంతీ, శాంతియుత సహజీవన పరిస్థితులా? లేక నిరంతరం అంతర్జాతీయ ఉద్రిక్తతా, ప్రచ్ఛన్నయుద్ధమూ సాగే పరిస్థితులా?

ఈ ప్రశ్నకు సమాధానం ఏమయి వుంటుందో అనుమానం అక్క ర్లేదు. సామ్రాజ్యవాద దేశాలలో పాలకులు ప్రచ్ఛన్న యుద్ధ పరిస్థితుల

సుపయోగించుకొని జాతీయ దురహంకారాన్ని రెచ్చగొడతారనీ, యుద్ధో న్మాదం పెచ్చరిల చేస్తారనీ, అడ్డూ - ఆపూ లేకుండా కమ్యూనిస్టు వ్యతిరేకతను రెచ్చగొడతారనీ, ఫాసిస్టు అనుకూలురనూ, కరుడు కట్టిన అభివృద్ధి నిరోధకులనూ అధికారంలో పెడతారనీ, ప్రజా తంత్రాన్ని రద్దు చేయడానికి, రాజకీయ పార్టీలను, ట్రేడ్ యూనియన్లను, శ్రామిక వర్గానికి చెందిన ఇతర ప్రజాసంస్థలను రద్దు చేయడానికి పూనుకొంటారనీ అందరూ ఎరుగుదురు.

కమ్యూనిస్టులు శాంతికోసం చేసే పోరాటం వలన వారికి ప్రజానీకంతోగల సంబంధాలు బాగా బలపడతాయి. వారి పలుకుబడీ, ప్రాధాన్యమూ పెరుగుతాయి. దానికి ఫలితంగా విప్లవానికి రాజకీయ బలగం అనేది ఏర్పడుతుంది.

శాంతి కోసమూ, విభిన్న వ్యవస్థలు గల దేశాల మధ్య సహజీవనం కోసమూ చేసే పోరాటంవలన అంతర్జాతీయ శ్రామికవర్గం తన అంతిమ గమ్యాలను సాధించేటందుకు జరిపే పోరాటం సంపూర్ణ రూపంలో వృద్ధిపొందే అవకాశం ఉన్నదేగాని ఆలస్యంకాదు.

చైనా కామ్రేడ్స్ తామే విప్లవాన్ని సాధించారు. మంచి అనుభవం ఉంది. అటువంటి వారే ఒక ముఖ్య విషయాన్ని అర్థం చేసుకోవడం లేదంటే నమ్మ శక్యం కాకుండా ఉంది. నేడు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ దృఢపడడం, పెట్టుబడి దారీ దేశాలలోని శ్రామికవర్గం విప్లవకర పోరాటం నడపడం, జాతీయ విముక్తికై పోరాటాలు కొనసాగడం, ఆసియా-ఆఫ్రికాలలో ఇటీవల విముక్తిగాంచిన దేశాల ఆర్థిక-రాజకీయ స్వాతంత్ర్యాన్ని బలపరచడం, శాంతికోసం పోరాడడం, దురాక్రమణ యుద్ధాలను వ్యతిరేకించడం, గుత్త వ్యాపారానికి వ్యతిరేకంగా ప్రజలు పోరాడడం, తదితర పద్ధతుల ద్వారానూ నేడు ప్రపంచ విప్లవం వృద్ధి పొందుతుంది. వీనిలో ఒకదాని కొకటి పోటీ పెట్టరాదు. వానిని ఏకముఖం చేసి గమ్యంవేపు - సామ్రాజ్యవాద పాలనను కూలదోయడంకోసం - నడిపించాలి.

చైనా కామ్రేడ్స్ ఫ్రెంచి, ఇటాలియను, అమెరికను తదితర కమ్యూనిస్టు పార్టీలను అవకాశవాదులనీ, సంస్కరణవాదులనీ 'పస్వత

రూపం ధరించిన పార్లమెంటరీ మన స్తత్వంగలవా'రనీ, చివరకు 'బూర్జువా సోషలిజానికి' దిగజారుతున్నారనీ, ఎంతో దురుసుగా, అవమానకరంగా నిందిస్తున్నారు. ఎందుకోసం ఈ తిట్లు? ఆ కమ్యూనిస్టు పార్టీలు నిల్చున్నపాటున శ్రామికవర్గ విప్లవ నినాదాన్ని ఇవ్వలేదని, విప్లవాత్మక పరిస్థితి లేనిదే ఆ నినాదం ఇవ్వరాదని చైనా నాయకులు కూడా తెలుసుకోవాలి.

దేశంలో విప్లవాత్మకమైన పరిస్థితి లేనప్పుడు సాయుధ తిరుగుబాటు నినాదం ఇవ్వడమంటే శ్రామికవర్గాన్ని ఓటమి పాల్జేయడమేనని మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞానం బాగా వున్నవారంతా ఎరుగుదురు. ఈ సమస్యను వి. ఐ. లెనిన్ ఎంత పరిశీలనగా ఆలోచించారో, విప్లవ కార్యాచరణకు సమయాన్ని నిర్దేశించడంలో ఎంత రాజకీయ చతురతా, నిజ పరిస్థితుల పరిజ్ఞానమూ ప్రదర్శించారో అందరూ ఎరుగుదురు. అక్టోబరు విప్లవానికి సరిగ్గా ముందు కార్యాచరణకు అక్టోబరు 24 వ తేదీ మరీ ముందయిపోతుందనీ, అక్టోబరు 26 బాగా వేళ మించిపోయి సర్వం చేయిజారి పోవచ్చుననీ, అందుచేత అక్టోబరు 25 నాడు అధికారం తప్పక స్వాధీనపరచుకోవాలనీ ఆయన చెప్పారు. వర్గ వైరుధ్యాల తీవ్రతను, విప్లవాత్మక పరిస్థితులుండటాన్ని నిర్ణయించడం ఎవరు? తిరుగుబాటుకు సమయాన్ని ఎన్నుకొనేదెవరు? ఆయా దేశాలలోని శ్రామికవర్గమూ, వారి అగ్రగామి శక్తి అయిన మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ మాత్రమే ఆ పని చెయ్యగలదు.

తాను శ్రామికవర్గ పార్టీనని చెప్పుకుంటూ, కేవలం ఆర్థిక సమస్యలను గురించే పనిచేస్తూ, శ్రామిక వర్గంలో విప్లవ చైతన్యం కలిగించకుండా, దానిని రాజకీయ పోరాటానికి, అధికారం పట్టుకొనడానికి తయారు చెయ్యలేకపోతే ఆ పార్టీ చెడ్డదని అంతర్జాతీయ శ్రామికవర్గోద్యమ చరిత్ర చెప్తుంది. అటువంటి సందర్భాలలో అది తప్పనిసరిగా సంస్కారవాద స్థితికే దిగజారుతుంది. రెండోవేపున కార్మిక, కర్షకులను, యావత్తు శ్రమజీవి ప్రజానీకానికే ఆర్థిక పరిస్థితిని చక్కబరచేటందుకు పోరాడకుండా రాజకీయ పోరాట కర్తవ్యాలను తీసుకొనే పార్టీ కూడా చెడ్డదే. అటువంటి పార్టీ ప్రజానీకానికి తప్పకుండా దూరమైపోతుంది. వర్గపోరాట రూపాలన్నింటినీ సరిగ్గా ఉపయోగించి, వాటిని చతురతతో సమన్వయపరచ

గలిగినదే నిజమైన విప్లవాత్మక పార్టీ అవుతుంది. మార్క్సిస్టు–లెనినిస్టు పార్టీ అవుతుంది. ప్రజానీకానికి నాయకత్వం వహించగలుగుతుంది. పెట్టుబడిదారీ విధానాన్ని విజయవంతంగా ముట్టడించి, అధికారాన్ని పట్టుకోవడంలో శ్రామికవర్గాన్ని విజయవంతంగా నడిపించగలుగుతుంది.

అభివృద్ధి పొందిన పెట్టుబడిదారీ రాజ్యాలలోని చాలా కమ్యూనిస్టు పార్టీలు శ్రామిక ప్రజల ఆర్థిక, సామాజిక ప్రయోజనాలకోసం పోరాటం తమ ప్రత్యక్ష కర్తవ్యం అనుకొంటున్నాయి, పెట్టుబడిదారీ విధానంలో సైతం సాధ్యమయ్యే ప్రజాతంత్ర సంస్కరణలకోసం పోరాడటం, శ్రామిక వర్గాల యొక్క, రైతాంగం యొక్క, జనాభాలోని పెటీ బూర్జువా తరగతుల వారియొక్క జీవన పరిస్థితుల సుకరం చేయడానికి పోరాడటం, ఆ విధంగా విస్తృత గుత్త వ్యతిరేక సంఘటనను నిర్మించడానికి సహకరించడం తమ ప్రత్యక్ష బాధ్యతగా భావిస్తున్నాయి. సోషలిస్టు విప్లవం విజయం, ఇంకా పోరాటం సాగించడానికి అది పునాది అవుతుంది. సరిగ్గా 1960 మాస్కో ప్రకటన చెప్తున్నదానినే అవి చేస్తున్నాయి. అదో మహా భయంకర పాపకార్యంగా చైనా నాయకులు భావిస్తున్నారు.

అభివృద్ధి పొందిన పెట్టుబడిదారీ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు చేస్తున్న ప్రతి పనినీ కాదన్నాక చైనా కామ్రేడ్స్ వర్గపోరాటపు అగ్రభాగంలో నిలబడి పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా పోరాడుతున్న కమ్యూనిస్టులతో ఏకీభవించాలనే ప్రాథమికపరిజ్ఞానాన్నైనా కనబరచలేదు. ఆయా దేశాలలో వున్న నిర్దిష్ట పరిస్థితుల పరిజ్ఞానాన్నీ, అక్కడ శ్రామిక వర్గం యొక్క విప్లవోద్యమం అనుసరిస్తున్న ప్రత్యేక పద్ధతుల పరిజ్ఞానాన్నీ చూపించలేదు. నిజానికి 'విప్లవంకోసమే' వారు విప్లవానికి దారితీసే మార్గాలనే త్రోసిపుచ్చారు. ప్రజల నుంచి కమ్యూనిస్టు పార్టీలు వేరుపడిపోయే మార్గాన్ని; గుత్తసంస్థలకు, పెట్టుబడిదారీ విధానానికీ వ్యతిరేకంగా జరిపే పోరాటంలో శ్రామికవర్గం మిత్రకోటిని కోల్పోయే పంథాను వారి నెత్తిన రుద్దుతున్నారు.

వివిధ దేశాలు వివిధ మార్గాలలో సోషలిజంలోనికి పరివర్తన పొందుతాయనే విషయంలోనూ ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంతో చైనా మిత్రులు భేదిస్తున్నారు.

సోషలిజంలోనికి శాంతియుత పద్ధతులలోనూ, తద్భిన్న పద్ధతుల లోనూ కూడ పరివర్తన వచ్చేటందుకు అవకాశం వున్నదనే అభిప్రాయంతో సోవియటు కమ్యూనిస్టు పార్టీ, ఇతర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలూ పని చేస్తున్నాయి. ఆ విషయం మాస్కో సమావేశాల ప్రకటన పత్రాలలోనూ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమంలోను కూడ స్పష్టంగా వున్నాయి. అది అందరకూ తెలుసు. అయినా చైనా మిత్రులు మేమూ, ఇతర సోదర పార్టీలూ శాంతియుత విధానా నొక్కదానినే గుర్తిస్తున్నామంటూ మొండిగా వాదిస్తున్నారు.

ఈ విషయమై తన అభిప్రాయం ఏమిటో సోవియటు కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ 1963 మార్చి 30 నాటి లేఖలో తిరిగి పేర్కొంది.

'శ్రామికవర్గమూ, వారి అగ్రగామి శక్తులయిన మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలూ అంతర్యుద్ధం అక్కర్లేకుండా శాంతియుత పద్ధతులతో సోషలిస్టు విప్లవాలను నడిపించడానికై ప్రయత్నిస్తున్నాయి. అటువంటి అవకాశా లున్నాయని గుర్తించడం శ్రామికవర్గం యొక్క, ప్రజలందరి యొక్క ప్రయోజనాలకూ, ఆ దేశం యొక్క జాతీయ ప్రయోజనాలకూ అనుగుణమైనది. అయితే ఏ పద్ధతులతో విప్లవాన్ని కొనసాగించాలనేది, కేవలం శ్రామికవర్గం మీదనే ఆధారపడి వుండదు. దోపిడీ వర్గాలు ప్రజలపై దౌర్జన్య ప్రక్రియలకు పూనుకొంటే, అధికార స్వాధీనానికి శ్రామికవర్గం శాంతికి భిన్నపంథాను చేపట్టవలసి వస్తుంది. అప్పటి పరిస్థితులనుబట్టి, దేశంలోని, ప్రపంచంలోని వర్గశక్తుల విభజనమీద ప్రతి ఒక్కటీ ఆధారపడి వుంటుంది.

'పెట్టుబడిదారీ విధానంలోంచి సోషలిజంలోనికి ఏ రూపాలలో పరివర్తన వచ్చినా, సహజంగా ఆ పరివర్తన సోషలిస్టు విప్లవం ద్వారా, వివిధ రూపాలలో కొనసాగే శ్రామికవర్గ నియంతృత్వం ద్వారా వస్తుంది. పెట్టుబడిదారీ దేశాలలోని శ్రామికవర్గం కమ్యూనిస్టుల నాయకత్వాన సాగిస్తున్న స్వార్థరహితమైన పోరాటాన్ని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఎంతో మెచ్చుకుంటూ, వారి కన్నివిధాల సహాయ సహకారా లందించడం తన కర్తవ్యంగా భావిస్తుంది.'

మా అభిప్రాయం ఏమిటో అనేకసార్లు చెప్పాం. దాని నింకా వివరించి చెప్పడం అవసరంలేదు.

అయితే, ఈ విషయంలో చైనా కామ్రేడ్స్ అభిప్రాయం ఏమిటి? వారి ప్రకటన లన్నింటిలోనూ, జూన్ 14 నాటి చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ జాబులోనూ కూడ అది ప్రధానంగా వినిపిస్తుంది.

ఎప్పుడైనాసరే, ఎక్కడైనాసరే, ఎందులోనైనాసరే సాయుధ తిరుగుబాటును గుర్తించడమే విప్లవ చైతన్యానికి ముఖ్యలక్షణమని చైనా కామ్రేడ్స్ అభిప్రాయం. ఈ విధంగా సోషలిస్టు విప్లవం విజయం పొందడానికి శాంతియుత పోరాట రూపాల నుపయోగించే అవకాశాన్ని చైనా మిత్రులు వాస్తవానికి తోసిపుచ్చుతున్నారు. హింసాయుతమున్నూ, హింసారహితములు అయిన విప్లవాత్మక వర్గపోరాట రూపాలన్నింటిలో కమ్యూనిస్టులు నిపుణత సంపాదించాలని మార్క్సిజం-లెనినిజం బోధిస్తూంది మరి.

అంతర్జాతీయ శ్రామికవర్గం యొక్క పోరాటానికీ, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా దేశాల ప్రజల జాతీయ విమోచనోద్యమాలకు మధ్య సంబంధాల సమస్య మరో ప్రధానాంశం.

సోషలిస్టు ప్రపంచ వ్యవస్థ, పెట్టుబడిదారీ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు కూడా నేడు అంతర్జాతీయ విప్లవాత్మక శ్రామిక వర్గోద్యమానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. అదీ, ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాల లోని జాతీయ విముక్తి ఉద్యమాలూ-ఇవి ఈనాటి మన యుగంలో మహత్తర శక్తులుగా వున్నాయి. సామ్రాజ్యవాదం మీద విజయం సాధించాలంటే వాని మధ్య సరియైన సంబంధాలను నిర్వహించడం ఒక ముఖ్యావసర మవుతుంది.

ఈ సమస్యను చైనా కామ్రేడ్స్ ఎలా పరిష్కరిస్తున్నారు? వారి నూతన 'సిద్ధాంతం' చూస్తే అర్థం అవుతుంది. ఈనాటి మన యుగంలో సామ్రాజ్య వాదానికీ, జాతీయ విముక్తి ఉద్యమానికీ మధ్య నున్నదే ప్రధాన వైరుధ్యం. కాని సోషలిజానికీ, సామ్రాజ్య వాదానికీ మధ్య నున్నది కాదని ఆ సిద్ధాంతం చెపుతున్నది. సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంలో సోషలిస్టు ప్రపంచవ్యవస్థ ప్రధాన నిర్ణయాత్మక శక్తి కాదు, అంతర్జాతీయ శ్రామికవర్గం యొక్క పోరాటమూ కాదు, మళ్ళీ జాతీయ విముక్తి ఉద్యమానిదే నిర్ణయాత్మక శక్తి యని చైనా మిత్రుల విశ్వాసం.

ఈ విధంగా నా మిత్రులు ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా ప్రజలలో సులభంగా మంచిపేరు సంపాదించుకోవాలనుకొంటున్నట్లుంది. కాని ఆ 'సిద్ధాంతా'ని ఎవ్వరూ మోసపోరాదు. చైనా సిద్ధాంత ప్రవక్తలు తెలిసి చేసినా, తెలియక చేసినా ఈ సిద్ధాంతం జాతీయ విముక్తి ఉద్యమాన్ని అంతర్జాతీయ శ్రామికవర్గంనుంచీ, వారు సృష్టించిన సోషలిస్టు ప్రపంచ వ్యవస్థనుంచీ ఖచ్చితంగా దూరంచేస్తుంది.

ఇది జాతీయ విముక్తి ఉద్యమానికెంతో ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది.

అయితే, అక్టోబరు విప్లవం జరిగి ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఏర్పడి సామ్రాజ్యవాదాన్ని పునాదులకంటా కదిల్చివేసి వుండకపోతే, వలసదారుల శక్తుల్ని క్రుంగదీసి వుండకపోతే ఆసియాలోని అసంఖ్యాక ప్రజానీకం ఎంత వీరత్వం చూపినా, స్వార్థత్యాగం ప్రదర్శించినా విజయం పొందడం సాధ్యమయ్యేదేనా ?

ఇప్పుడు స్వాతంత్ర్యం సాధించుకొన్న ప్రజలు తమ పోరాటంలో ఒక నూతనదశను చేసుకొన్నారు. తమ రాజకీయ విజయాలనూ, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని దృఢపరచుకొనడానికై తమ శక్తియుక్తులన్నీ కేంద్రీకరిస్తున్నారు. అందుచేత సోషలిస్టు రాజ్యాల సహాయం లేకపోతే ఆ సమస్యలను పరిష్కరించడం ఎంతో కష్టమని, ఒక విధంగా అసాధ్యమేనని వారెరుగరా ?

జాతీయ విముక్తి ఉద్యమానికి, దాని మహత్తర భవిష్యత్తుకూ వున్న గొప్ప ప్రాముఖ్యాన్ని మార్క్సిస్టు-లెనినిస్టులు ఎల్లప్పుడూ నొక్కి చెప్తున్నారు. అయితే, అది ఇతోధికవిజయాలను పొందాలంటే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ప్రముఖశక్తియైన సోషలిస్టు ప్రపంచ వ్యవస్థతో అచంచల మైత్రీ, సహకారమూ అవసరం; పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికోద్యమంతో దృఢమైత్రి అవసరం, అని వారు భావిస్తున్నారు. ఈ విషయాన్ని 1960 మాస్కో స్టేట్‌మెంట్‌లోనే స్పష్టంగా చెప్పేరు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో విజయం పొందడానికి శ్రామికవర్గం నాయకత్వం ముఖ్యావసరమనే లెనిన్ అభిప్రాయంపైని యిది ఆధారపడింది. అటువంటి నాయకత్వం వున్నప్పుడే ఆ వుద్యమానికి నిజమయిన సోషలిస్టు ఉద్యమ లక్షణం ఏర్పడుతుంది. చివరకు సోషలిస్టు విప్లవ మార్గానికి పరిణతి పొందుతుంది.

లెనిన్ యొక్క ఈ అభిప్రాయాన్ని అక్టోబర్ విప్లవ అనుభవమూ, ఇతర దేశాల అనుభవాలూ పరీక్షకు పెట్టాయి. ఎప్పటికీ కూడ దాని విషయంలో సందేహాలు ప్రకటించలేదు. అయినా చైనా కామ్రేడ్స్ లెనిన్ సిద్ధాంతాలను "సవరించ" దలచినట్లు కనబడింది. శ్రామిక వర్గంగాక, పెటీబూర్జువా వర్గమో, జాతీయ బూర్జువా వర్గమో, కడకు దేశ భక్తులైన కొందరు రాజులు, రాజకుమారులు, ప్రభువంశీకులూ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రపంచ పరివ్యాప్తంగా సాగే పోరాటానికి నాయకులు కావాలని నిరూపించదలచినట్లుంది. అటు తర్వాత, మన ముందున్న సమస్యలను శ్రామికవర్గదృక్పథంతో తప్ప మరోవిధంగా ఎప్పుడూ ఏ పరిస్థితులలోనూ చూడరాదని చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి పాఠాలు చెప్తుంది !

అంతర్జాతీయ శ్రామికవర్గమూ, జాతీయవిముక్తి ఉద్యమమూ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగించే సంయుక్త పోరాటంలో, తమ సమాన ప్రయోజనాలదృష్ట్యా అచంచల మైత్రీసహకారాలతో పనిచేస్తే తప్పకుండా విజయాలు లభిస్తాయి. ఆ పోరాటంలో శ్రామికవర్గం నిస్వార్థతతో యావన్మంది ప్రజలకు సేవచేయడం ద్వారా తన నాయకత్వ పాత్రను ఆర్జిస్తుంది. దాని నాయకత్వం దానికి, దాని మిత్రులకూ కూడ విజయాలను సాధించి పెట్టగలదనే విశ్వాసాన్ని కలిగిస్తుంది.

ప్రపంచ విప్లవ ఉద్యమంలో జాతీయ విముక్తి ఉద్యమం ఒక భాగమనీ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ముందుకు వస్తున్న ఒక మహత్తరశక్తియనీ మన లెనినిస్టుపార్టీ భావం. శాస్త్రీయ కమ్యూనిజాన్ని ప్రవచించిన మార్క్సు, ఏంగిల్సులు 'ప్రపంచ కార్మికులారా! ఏకం కండి!' అని ఇచ్చిన పిలుపు అంతర్జాతీయ శ్రామికవర్గానికి రణదుందుభి అయింది. మార్క్సు, ఏంగిల్సుల సిద్ధాంతాలను ముందుకు కొనిపోయిన వ్లాదిమిర్ ఇలిచ్ లెనిన్ అక్టోబరు మహా విప్లవ విజయానంతరం ఏర్పడిన నూతన చారిత్రక పరిస్థితులలో, ముఖ్యంగా సోషలిస్టు విప్లవానికీ, జాతీయ విముక్తి ఉద్యమానికీ అభేద్యమైన సంబంధం వున్నదని గమనించారు.

ప్రపంచ విప్లవ విజయానికై కొనసాగించే పోరాటంలో "ప్రపంచ కార్మికులారా ! ఏకంకండి !" అనేదే ఇంతవరకు ప్రధాన నినాదంగా వుంది. ఇప్పుడూ అదే ఉంటుంది. నూతన పరిస్థితులలో ఆ నినాదం

యొక్క పరిధి విస్తరించింది. 'అన్ని దేశాల కార్మికులారా! పీడిత ప్రజలారా! ఏకంకండి!' అనే నినాదాన్ని లెనిన్ అంగీకరించిన విషయం అందరికీ తెలుసు. శ్రామికవర్గం యొక్క నాయకత్వ పాత్రనూ, జాతీయ విముక్తి వుద్యమ ప్రాముఖ్యత పెరగడాన్నీ ఈ నినాదం స్పష్టపరుస్తూంది. ఈ మార్క్సిస్టు-లెనినిస్టు అంతర్జాతీయ సూత్రానికి కట్టుబడే మన పార్టీ తన అన్ని కార్యక్రమాలను నిర్వహిస్తూంది.

ఇక్కడో ప్రశ్న వస్తుంది: ఈనాటి ప్రధాన సమస్యలమీద చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం తప్పు నిర్ణయాలకు ఎందుకు వచ్చింది? యుద్ధము, శాంతి, విప్లవం యెడల పుస్తకాలు వల్లించే పిడివాద వైఖరి అవలంబించుతూ చైనా కామ్రేడ్స్ వాస్తవాలకు దూరమై, ప్రస్తుత యుగపు నిర్దిష్ట పరిస్థితులను అవగాహన చేసుకోలేకపోవడమైనా వుండాలి; లేదా విప్లవానితో ఎలాంటి సంబంధమూ లేని తమ ఇతర లక్ష్యాలను మరుగు పరచుకునేందుకు వారు 'ప్రపంచ విప్లవం' గురించి ఇంత బిగ్గరగా అరుస్తూ వుండనైనా వుండాలి.

ఇదంతా చూస్తే చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమాన్ని ఎంత వినాశకరమైన తప్పుధోరణికి నెట్టుతూందో కనబడుతుంది. 'సాధారణ కార్యవిధానం' పేరుతో చైనా నాయకులు చేస్తున్న ప్రతిపాదనలో ఏమీ లేదు. సమయం, వర్గశక్తుల పరస్పర సంబంధాల సందర్భమూ లేకుండా, అధునాతన చారిత్రకదశలో వున్న ప్రత్యేకతలను పరిశీలించకుండా తయారుచేసిన శ్రామికవర్గ అతి సామాన్య కర్తవ్యాలు తప్ప వేరేం కాదు. ఈనాటి కాలపరిస్థితులలో మన ఉద్యమ బాధ్యతలు ఏలాగ మారుతాయో చైనా కామ్రేడ్స్ గమనించడం లేదు. గమనించదలచటం లేదు కూడా సాధారణ కార్యవిధానాన్ని వారు. పెట్టుబడిదారీ విధానం నుంచి సోషలిజంలోకి మార్పు వచ్చేకాలంలో, అన్నిదశలకూ వర్తించే సర్వసామాన్య కర్తవ్యాలుగా చిత్రిస్తూ, వాని కున్న నిర్దిష్టతా, ప్రయోజనమూ, నిజమైన శక్తి లేకుండా చేస్తున్నారు.

తమ ప్రస్తుత విధానాన్ని వివరిస్తూ సోదర పార్టీలు వివిధ దేశాల లోనూ, ప్రపంచం మొత్తం మీదనూ గల వర్గశక్తుల విభజనను, పరస్పర వ్యతిరేకమయిన రెండు వ్యవస్థల అభివృద్ధిలోనూ, ప్రస్తుత కాలం జాతీయ

వివిధ సోషలిస్టు దేశాల అభివృద్ధిలోనూ కనబడే ప్రత్యేకతలనూ సవిమర్శకంగా పరిశీలించాయి.

ప్రపంచ పరిస్థితులలో వస్తూన్న మార్పులను కూలంకషంగా పరిశీలించాక, ప్రపంచంలోని సోదర పార్టీలు ప్రస్తుత యుగస్థితిని మార్క్సిస్టు-లెనినిస్టు పంథాలో ఈ విధంగా నిర్వచించగలిగాయి: పెట్టుబడిదారీ విధానంలోంచి సోషలిజంలోకి రావడం మనం వున్న ఈ యుగంలోని ప్రధానవిషయం. ఈ యుగాన్ని ప్రారంభించినది అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం. రెండు విభిన్న సామాజిక వ్యవస్థల మధ్య పోరాటం సాగుతున్న యుగం ఇది. సోషలిస్టు విప్లవాలూ, జాతీయ విముక్తి విప్లవాలూ సాగుతున్న యుగం ఇది. ఈ యుగంలో సామ్రాజ్యవాదం శిథిలమయింది. వలసవ్యవస్థ తుడుచుకుపోయింది. నిరంతరం నూతనంగా ప్రజలు సోషలిస్టు పంథాను స్వీకరిస్తున్న యుగం. ప్రపంచ పరివ్యాప్తంగా సోషలిజం, కమ్యూనిజాలు విజయం పొందుతున్న యుగం.'

ప్రస్తుత యుగాని కిచ్చిన ఈ నిర్వచనం, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం యొక్క వ్యూహాన్నీ, ఎత్తుగడలనూ సరిగ్గా రూపొందించడానికి పునాదిగా వుపయోగపడింది.

మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలు తమ సమిష్టి కార్యవిధానాన్ని నిర్ణయించుకొన్నాయి. దానిలోని ప్రధాన విషయాల నీ విధంగా పేర్కొనవచ్చును:

—సోషలిజాన్నీ, కమ్యూనిజాన్నీ నిర్మిస్తున్న ప్రజలు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నడుపుతున్న పోరాటమూ, పెట్టుబడిదారీ దేశాలలోని విప్లవాత్మక శ్రామికవర్గోద్యమమూ, పీడిత ప్రజల జాతీయ విముక్తి పోరాటమూ, ప్రజాతంత్రోద్యమాలూ ఏకోన్ముఖంగా పెనవేసుకుపోవడం, ఈ యుగంలోని ప్రపంచ విప్లవక్రమం యొక్క స్వభావాన్నీ, సారాంశాన్నీ నిర్ణయిస్తుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవ శక్తుల సమ్మేళనలో నిర్ణాయకపాత్ర అంతర్జాతీయ శ్రామిక వర్గానిదీ, అది సృష్టించిన సోషలిస్టు ప్రపంచ వ్యవస్థదీను. తన ఆదర్శబలంతోనూ, ఆర్థిక నిర్మాణంతోనూ అది ప్రపంచ సోషలిస్టు వ్యవస్థయొక్క నడకను ప్రభావితం చేస్తుంది.

—నేడు కనబడుతూన్న చారిత్రక పరిస్థితుల (సామ్రాజ్యవాదం యొక్క దౌర్జన్యం బాగా పెరగడం, ఎంతో విధ్వంసం కలిగించే ఆయుధాలు నిర్మించబడడం మొ॥వి) మూలంగా, ప్రస్తుతకాలంలో సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తుల నెదుర్కొంటున్న కర్తవ్యాలన్నింటా, అణుయుద్ధ నివారణకై జరిపే పోరాటానిది కీలకస్థానం. శాంతిని కాపాడేందుకూ, మానవజాతిని అణుయుద్ధ విధ్వంసంనుంచి రక్షించేందుకూ శాంతికాముక శక్తులన్నింటినీ సమీకరించడం ఈనాడు కమ్యూనిస్టు పార్టీల ప్రథమ కర్తవ్యం.

—ప్రతిదేశంలోనూ సాగుతున్న వర్గపోరాటాలు పెంపొందడం ఫలితంగా సోషలిస్టు విప్లవం సిద్ధిస్తుంది. ఒక్కొక్క దేశంలోని నిర్దిష్ట పరిస్థితులు ఆ విప్లవంయొక్క రూపాన్నీ, విధానాన్నీ నిర్ధారణ చేస్తాయి. పెట్టుబడి అధికారాన్ని విప్లవంద్వారా తొలగద్రోయడమూ, ఏదో ఒక రూపంలో శ్రామివర్గ నియంతృత్వాన్ని స్థాపించడమూ అనేది సాధారణ సూత్రం. అంతర్యుద్ధం అక్కర్లేకుండా సోషలిస్టు విప్లవం శాంతియుత పంథాలో నడిపించేటందుకు ఈనాడున్న అవకాశాలు చూవత్తునూ ఉపయోగించుకోవడం కార్మికవర్గంయొక్క, కమ్యూనిస్టు పార్టీలయొక్క కర్తవ్యం. అలా చేస్తూనే శాంతిరహిత పంథా ననుసరించడానికి సర్వసన్నద్ధంగా వుండాలి. బూర్జువావర్గం యొక్క ప్రతిఘటనను ఆయుధబలంతో అణచివేయడానికి సిద్ధంగా వుండాలి. సోషలిజం కోసం జరిపే పోరాటంలో సామాన్య ప్రజాతంత్ర పోరాటం ఒక తప్పనిసరియైన భాగం.

—జాతీయ విముక్తిపోరాటమంలో శ్రామికవర్గంయొక్క కమ్యూనిస్టు పార్టీలయొక్క గమ్యాలివి. సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాతంత్ర విప్లవ కర్తవ్యాలను చివరకంటా సాగించాలి. రైతాంగంతోనూ, దేశభక్తిగల జాతీయ బూర్జువా వర్గంతోనూ స్నేహం మీద ఆధారపడిన జాతీయ సంఘటనను వృద్ధిపరచాలి, బలపరచాలి. జాతీయ ప్రజాతంత్ర రాజ్యాంగాన్ని ఏర్పరచి, పెట్టుబడిదారీ భిన్న అభివృద్ధి పంథాకు మరలించేటందుకు అనుకూలాలను సమకూర్చాలి.

—కమ్యూనిస్టులు తమ్ము ఎదుర్కొంటున్న చారిత్రక కర్తవ్యాలను విజయవంతంగా పరిపూర్తి చెయ్యాలంటే సోషలిస్టు దేశాలమధ్య సహ

వార, పరస్పర సహాయక సంబంధాలు ఏర్పడాలి. అంతర్జాతీయ కమ్యూనిస్టు కార్మికోద్యమంలో సమన్వయం, ఐక్యతా వుండాలి; సంయుక్తంగా రూపొందించిన నిర్ణయాలకూ స్థానాలకూ కట్టుబడి వుండాలి. పార్టీ జీవితంలోనూ, తమ మధ్య సంబంధాలలోనూ లెనినిస్టు సూత్రాల ననుసరించాలి.

మన యుగంలో ప్రపంచ విప్లవ విధానం వృద్ధిపొందే ప్రధాన మార్గాలివి. ప్రస్తుత దశలో అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సామాన్య కార్యవిధానం యొక్క ప్రధాన అంశాలివి. శాంతి, ప్రజాతంత్రం, జాతీయ స్వాతంత్ర్యం, సోషలిజం కోసం పోరాడడం — క్లుప్తంగా చెప్పాలంటే సాధారణ కార్యవిధానం సారాంశ మిది. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం విజయం పొందవలెనంటే, ఈ కార్యవిధానాన్ని కార్యరూపంలో పట్టుదలతో కొనసాగించాలి.

ప్రస్తుత పరిస్థితులలో అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం యొక్క ఈ ప్రధాన సిద్ధాంతాలన్నిటినీ సోదర కమ్యూనిస్టు - కార్మిక పార్టీలు ప్రకటనలోనూ, డిక్లరేషనులోనూ సమష్టిగా రూపొందించాయి. మన దేశంలోనూ, ప్రపంచ పరివ్యాప్తంగాను లభించిన విప్లవానుభవాల మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రీకరణలపై సోవియట్ కమ్యూనిస్టు పార్టీ రచన నూతన కార్యక్రమం పూర్తిగా ఆధారపడ్డింది.

## 5

ప్రస్తుతం మనలను ఎదుర్కొంటున్న రాజకీయ, సిద్ధాంత ముఖ్య సమస్యలపై చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు పొరపాటు దృక్పథాలకు, ఆచరణలో ప్రపంచ సోషలిస్టు శిబిరాన్ని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని చీల్చడానికి వారనుసరించుతున్న కార్యకలాపాలకు అవినాభావ సంబంధముంది.

మొత్తం సోషలిస్టు శిబిరాని కంతటికీ కీలకం సోవియట్ యూనియన్, చైనా ప్రజారిపబ్లిక్‌ల మధ్య ఐక్యతేనని చైనా కామ్రేడ్స్ కేవలం మాటల్లో మాత్రం గుర్తించుతున్నారు. కాని వాస్తవంలో మన దేశంతోను, మన పార్టీతోనూ సంబంధాలను అన్ని విధాలా భంగపర్చుతున్నారు.

సోషలిస్టు రాజ్యాల కుటుంబానికి విధేయత చూపాలని చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం తరచుగా మాట్లాడుతుంది. కాని ఈ కుటుంబం యెడల వారు అనుసరించుతున్న దృక్పథం వారి ప్రకటనలకు పూర్తిగా విరుద్ధంగా వుంది.

గత మూడు సంవత్సరాల లెక్కలను పరిశీలించితే ఇతర సోషలిస్టు దేశాలతో తమ వర్తకాన్ని చైనా ప్రజా రిపబ్లిక్ 50 శాతనికి మించి తగ్గించి వేసింది. చైనా కామ్రేడ్స్ తీసుకున్న పంథా ఫలితంగా కొన్ని సోషలిస్టు దేశాలు తీవ్రంగా నష్టపడ్డాయి

సోషలిస్టు దేశాలమధ్య వుండాలిసిన పరస్పర సంబంధాల విషయం లోనే గాక, తనేక ఇతర సందర్భాలలో చైనా నాయకత్వం అన్ని దేశాలు సర్వసాధారణంగా అనుసరించే నియమాలకు, నిబంధనలకు పూర్తి విరుద్ధంగా ప్రవర్తించుతోంది.

అంతకుముందు చేసుకున్న ఒడంబడికలను రద్దుచేయడం ద్వారా కొన్ని సోషలిస్టు రాజ్యాల జాతీయ ఆర్థిక విధానానికి తీవ్రమైన నష్టాలు కలిగించింది. ఇలా ఆర్థిక సంబంధాలను తగ్గించడంవల్ల చైనా ఆర్థిక విధానంకూడ దెబ్బ తింటుందని సహజంగానే అర్థమవుతుంది.

తాము తీసుకున్న చర్యలను ప్రజల ముందు సమర్థించుకోవడానికి చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం "స్వంతశక్తులపై ఆధారపడటమనే" ఒక సిద్ధాంతాన్ని ఈ మధ్య ప్రచారంలోకి తెచ్చింది. ప్రతిదేశంలోను సోషలిజం నిర్మించడానికి ప్రధానంగా ఆ దేశ ప్రజల కృషిపైనే ఆధారపడి వుంటుంది: దేశాంతర్గత వనరులను బాగా వినియోగించుకోవడంద్వారా సోషలిజానికి భౌతిక టెక్నికల్ పునాదు వేయాలనేమాట కూడ సరైనదే. ప్రతిదేశంలోనూ సోషలిజం నిర్మించే బాధ్యత ప్రధానంగా ఆ దేశ ప్రజలది, కార్మిక వర్గానిది, కమ్యూనిస్టు పార్టీది.

ప్రథమ సోషలిస్టు దేశమైన సోవియట్ యూనియన్ కేవలం స్వంత శక్తులపై ఆధారపడి, దేశీయ వనరులను ఉపయోగించుకొని సోషలిజం నిర్మించవలసి వచ్చింది. ఇపుడు సోషలిస్టు దేశాల వ్యవస్థ వున్నప్పటికీ, ఏ దేశ ప్రజలైనా చేతులు ముడుచుక్కూచుని ఇతర సోషలిస్టు దేశాల సహాయంపై పూర్తిగా ఆధారపడటం సరైనదని

అర్థం కాదు. ఆర్థిక పురోభివృద్ధిని జయప్రదం చేయడానికి, ప్రతి సోషలిస్టు దేశంలోని కమ్యూనిస్టు పార్టీ దేశీయ వనరులను పూర్తిగా సమీకరించడం తన కర్తవ్యమని భావించుతుంది. అందుచేత స్వంత శక్తులపై ప్రధానంగా ఆధారపడి సోషలిజం నిర్మించుతామని చైనా పార్టీ కేంద్రకమిటీ చేసిన ప్రకటన నిజ వుద్దేశ్యమదే ఐతే ఎలాంటి అభ్యంతరం వుండకూడదు,

కాని చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ లేఖ పూర్తి పాఠాన్ని చైనా పత్రికల్లో వస్తున్న అనేక ప్రకటనలను పరిశీలించితే పై సిద్ధాంతానికి ఆచరణలో వారిస్తున్న అన్వయాన్ని అంగీకరించడం అసంభవమౌతుంది.

“ప్రధానంగా స్వశక్తులపై ఆధారపడి సోషలిజం నిర్మించాలనే” సూత్రం మరుగున స్వయం సంపూర్ణమైన ఆర్థిక విధానాల్లను సృష్టించాలనే దృక్పథం దాగివుంది. అందుకు ఇతర దేశాలతో ఆర్థిక సంబంధాలను కేవలం వర్తకానికే మాత్రమే పరిమితం చేయడం జరుగుతోంది. ఈ దృక్పథాన్ని చైనా కామ్రేడ్స్ ఇతర సోషలిస్టు దేశాలపైన కూడ రుద్దాలని ప్రయత్నించుతున్నారు.

“స్వశక్తినిపై ఆధారపడా”లనే ప్రకటన, సోషలిస్టు దేశాలమధ్య సన్నిహిత స్నేహబంధాలను బలహీనపరచడానికి చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వానికి అవసరమయ్యింది. సోషలిస్టు అంతర్జాతీయతా సిద్ధాంతాలను ఈ విధానానికి ఏ మాత్రం పొసగదు. సోషలిస్టు కుటుంబం ఐకమత్యాన్ని ధ్వంసం చేసే ప్రయత్నంగా దీనిని పరిగణించక తప్పదు,

ఆర్థిక సంబంధాలను తగ్గించుకోవడంతో పాటు చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం సోవియట్ యూనియన్‌తో సంబంధాలను చెడగొట్టేందుకు మరికొన్ని చర్యలను తీసుకుంది.

చైనా నాయకులు సోషలిస్టు శిబిరక ఐక్యతను పాడుచేయడమే గాక, యావత్తు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం ఐకమత్యాన్ని కూడా ధ్వంసం చేస్తున్నారు: శ్రామికవర్గ అంతర్జాతీయతా సిద్ధాంతాలను కాల రాస్తున్నారు: సోదర పార్టీల మధ్య వుండాల్సిన స్నేహసంబంధాలను ఘోరంగా భగ్నం చేస్తున్నారు.

అమెరికా యునైటెడ్ స్టేట్స్, బ్రెజిల్, ఇటలీ, బెల్జియం, ఆస్ట్రేలియా, ఇండియా దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీలకు వ్యతిరేకంగా అసమ్మతి తెలిపే బృందాలను చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం సమీకరిస్తోంది, బలపరుస్తోంది. ఉదాహరణకు బెల్జియంలో కిందటి మహాసభలో పార్టీనుంచి బహిష్కరింపబడిన గ్రిప్ ముఠాను బలపరుస్తోంది. అమెరికాలో కమ్యూనిస్టు పార్టీకి వ్యతిరేకంగా పోరాడటమే లక్ష్యంగా పెట్టుకున్న 'సుత్తి, ఉక్కు' వామపక్ష అవకాశవాదగ్రూపు కార్యకలాపాలకు మద్దతు యిస్తోంది. బ్రెజిల్‌లో కమ్యూనిస్టు పార్టీ నుంచి తొలగింపబడిన ముఠాలను (ఉదాహరణకు అమెజానస్ గ్రాబోయిస్ గ్రూపును) చైనా కామ్రేడ్స్ బలపరుస్తున్నారు.

ఆస్ట్రేలియాలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వానికి వ్యతిరేకంగా, గతంలో నాయకుల్లో ఒకడైన ఇ. హిల్ సహాయంతో విచ్ఛిన్నచర్యలను సాగించడానికి చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్రయత్నించింది. ఒకసారి చైనా ప్రజా రిపబ్లిక్‌కు వెళ్ళి, ఆస్ట్రేలియా పార్టీ వ్యతిరేక ప్రకటనను ఇ. హిల్ బహిరంగంగా చేశారు. తనతో ఏకీభవించేవారితో కలసి ముఠాను నిర్మించడానికి ప్రయత్నించారు. ఆస్ట్రేలియా కమ్యూనిస్టుపార్టీ అతడిని కేంద్రకమిటీ నుంచి తొలగించిన తర్వాత, దర్పంగా పెకింగుకు వెళ్ళాడు.

ఇటలీలో కమ్యూనిస్టుపార్టీ యొక్క పాదువా ఫెడరేషన్ మాజీ ఉద్యోగుల గ్రూపు కార్యకలాపాలను చైనా ప్రతినిధులు ప్రోత్సహిస్తున్నారు. ఆ ముఠా 'విప్లవ' తిరుగుబాటు పిలుపు యిస్తూ కరపత్రాలను ప్రచురించింది.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల్లోని కమ్యూనిస్టు కార్మిక పార్టీలలో రహస్యంగా విచ్ఛిన్న చర్యలను సాగించడానికి చైనా పార్టీ కామ్రేడ్స్ ఎక్కువగా పనిచేస్తున్నారు.

కమ్యూనిస్టు వుద్యమంనుండి బయటికిపోయిన విభేదించేవాళ్ళను, ద్రోహులను చైనా నాయకులు పొగడుతున్నారు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ విధానానికి వ్యతిరేకంగానూ, యావత్తు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ గమనానికి వ్యతిరేకంగానూ అలాంటివారు వ్రాసిన నిందాపూర్వకమైన వ్యాసాలను తమ పత్రికలలో పునర్ముద్రించుతున్నారు.

సింహళ దేశంలో, ట్రాట్స్కీస్టుల "నాల్గవ అంతర్జాతీయ పార్టీ"కి తాబేదారుగా పనిచేస్తున్న ఇ. సమరక్కొడి గ్రూపుతో చైనా ప్రతినిధులు సన్నిహిత సంబంధాలను కొనసాగించుతున్నారు.

నాల్గవ ఇంటర్నేషనల్‌కు చెందిన ట్రాట్స్కీస్టులు తమ లక్ష్యాలను నెరవేర్చుకోడానికి చైనా కామ్రేడ్స్‌వైఖరిని వినియోగించుకొంటున్నారు. చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీకి లేఖను వ్రాస్తూ క్రింది బహిరంగ ప్రకటన చేసారు: "నాల్గవ ఇంటర్నేషనల్ మొట్టమొదటనుంచి... ప్రస్తుతం మీరే ఆశయాల కొరకు నిలబడుతున్నారో....వాటికోసమే పోరాడుతూ వచ్చినందున మీ పక్షమే వహించుతుంది...నాల్గవ ఇంటర్నేషనల్ సంస్థకార్యవర్గం, యావత్తుకమ్యూనిస్టు వుద్యమంలో మీరు ప్రారంభించిన చర్చను హర్షించుతూంది. దానిని అభివృద్ధి చేయాలనికోరుతూంది."

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం ఆమోదించిన విధానంనుంచి వెనక్కి పోకుండావున్న సోదర కమ్యూనిస్టు పార్టీలను, నాయకులను చైనానాయకులు ఎదుర్కొంటూ ఘాటుగా విమర్శించుతున్నారు. అమెరికా, ఫ్రెంచి, ఇటాలియన్, ఇండియన్ కమ్యూనిస్టుపార్టీల కార్యకలాపాలను అప్రతిష్ఠపాలు చేస్తూ వ్యాసాలను వ్రాసి, అన్ని భాషలలోనూ ప్రకటించి విరివిగా పంచారు. "రెండు నాల్కలతో మాట్లాడుతున్నారనీ", "మితవాద అవకాశవాదమనీ", "రివిజనిజమనీ", "కమ్యూనిస్టుల నైతిక ప్రవర్తన సూత్రాలకు విరుద్ధమనీ", "సోషల్ డెమాక్రేటుల దిగజారుడనీ", "పిరికి గుండెలనీ", "బాధ్యతా రాహిత్యమనీ", "చిలుక పలుకులనీ", "ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలలోని విప్లవ ప్రజల యెడల అహంకారం, ఏవగింపు" ప్రదర్శించుతున్నారని అనేకరకాల నీచప్రచారం సోదరపార్టీల ప్రముఖ నాయకులకు వ్యతిరేకంగా చేస్తున్నారు యీ వ్యాసాల రచయితలు.

"అతిసాహసులైన అమెరికన్ సామ్రాజ్యవాదులతో ఏకమై ప్రవర్తించుతున్నారని అమెరికా, పశ్చిమ యూరపుదేశాల కమ్యూనిస్టుపార్టీలను చైనా నాయకులు నిందించుతున్నారు. ఇండియా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని కేవలం ముఠాగా చిత్రించుతున్నారు. "సామ్రాజ్యవాదంయొక్క అన్నిరకాల ప్రతిఘాతకుల భవిష్యత్తును గురించి ఆవేదనపడుతున్నా"రని ఫ్రెంచి, ఇటలీ, ఇండియా, అమెరికా కమ్యూనిస్టుపార్టీల నాయకులపైన దారుణమైన ఆరోపణలు చేస్తున్నారు. జూన్ 14 వ తేదీన వ్రాసిన లేఖలో

సోవియట్ పార్టీనిగూడ "సామ్రాజ్యవాదానికి సహాయకునిపాత్ర వహిస్తుందని" ఆరోపణ చేసేందుకు చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం తయారయింది. ఇంతవరకు ట్రాట్క్సిస్టులు మినహా మరెవ్వరూ లెనిన్ నిర్మించిన గొప్పపార్టీపైని పూర్తిగా నిర్హేతుకమైన అలాంటి నిందారోపణలు చేయడానికి సాహసించలేదు!

చైనా కామ్రేడ్స్ చేస్తున్న అలాంటి చర్యలను సామ్రాజ్యవాద ప్రచారకులు హర్షింపడంలో ఆశ్చర్యం లేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో "సంక్షోభం" వచ్చిందని, చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ తీసుకున్న వైఖరివల్ల ఏర్పడిన విభేదాలను సామ్రాజ్యవాద ప్రభుత్వాలు వినియోగించుకోవాలని పదేపదిగా బూర్జువా పత్రికలు సలహాయివ్వడం యాదృచ్ఛికం కాదు.

ప్రపంచ కమ్యూనిస్టు,వర్కర్సు పార్టీల సమాచార,సిద్ధాంత పత్రికయైన "శాంతి, సోషలిజం సమస్యలు" సంపాదక వర్గాన్నుంచి చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులు విరమించుకున్నారు. ఆ పత్రికను చైనా భాషలో ప్రకటించడం మానివేసి, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ కార్యకలాపాలను గురించి చైనా కమ్యూనిస్టులు తెలుసుకునే అవకాశం అవకాశం లేకుండా చేసారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో చీలికలు తెచ్చేందుకు చైనా నాయకత్వం అనుసరిస్తున్న చర్యను సోదర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలు సముచితమైన కోపంతో ప్రతిఘటింపుతున్నాయి.

సోదర కమ్యూనిస్టుపార్టీల మధ్య వుండాలిసిన సంబంధాలను గురించి చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ తమ లేఖలో ఇలా వ్రాసింది: "ఇతర సోదరపార్టీల కంటే ఉన్నతస్థానంలో వున్నట్లుగా ఏ ఒకపార్టీ తనకు తానే నిర్ణయించుకోవడం అనుమతించకూడదు....సోదర పార్టీల అంతరంగిక విషయాలలో జోక్యం కలిగించుకోవడం అనుమతింపకూడదు...." ఇది పూర్తిగా సరైన ప్రకటనే. కాని ఇలాంటి అనుమతింపడానికి వీల్లేని చర్యలను చైనా కామ్రేడ్సే చేస్తున్నారు. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమప్రయోజనాలకు విరుద్ధంగాను, ప్రకటనల్లోని డిక్లరేషన్ లోని సూత్రాలకు నిబంధనలకు విరుద్ధంగాను ప్రవర్తింపుతూ తమ పలుకుబడి, కంట్రోలుక్రింద సోదర పార్టీలను వుంచాలని ప్రయత్నించుతున్నారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోనూ, సోషలిస్టు శిబిరం లోనూ చైనా పార్టీ నాయకత్వం అనుసరించుతున్న ప్రత్యేక పంథా ఏమిటో తెలుసుకోడానికి అల్బేనియా సమస్య యెడల వారి వైఖరి స్పష్టమయిన ఉదాహరణని చెప్పవచ్చు. ప్రస్తుతం మనల నెదుర్కొంటున్న ముఖ్య సమస్యలపై, 1960 సంవత్సరం ద్వితీయ భాగంలో అల్బేనియా నాయకులు తీవ్రవాద అవకాశవాద ధోరణితో బహిరంగంగా ముందు కొచ్చారు. సోవియట్ పార్టీకి ఇతర సోదర పార్టీలకు వ్యతిరేక విధానాన్ని అనుసరించటం ప్రారంభించారు. అల్బేనియన్ నాయకత్వం తమ దేశంలో సోవియట్ వ్యతిరేక ప్రచారాన్ని ప్రారంభించిన ఫలితంగా సోవియట్ దేశంతో రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలు పాడయ్యాయి.

అల్బేనియన్ నాయకులనుసరించుతున్న లెనినిస్టు వ్యతిరేక చర్యలను కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీలలో అత్యధిక మెజారిటీ నిశితంగా విమర్శించాయి. చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకులు మాత్రం పూర్తిగా విభిన్నమైన వైఖరిని అవలంబించారు. అల్బేనియా నాయకులను తమ అభిప్రాయాలను వ్యక్తం చేసేవారిగా వినియోగించుకోవడానికి సర్వ విధాలా ప్రయత్నించారు. సోవియట్ యూనియన్‌కు, ఇతర సోషలిస్టు దేశాలకు, సోదర పార్టీలకు వ్యతిరేకంగా బహిరంగ పోరాటం జరిపేందుకు చైనా కామ్రేడ్స్ వారిని ప్రోత్సహించారని ఇపుడు తెలుస్తూంది.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీకి, ఇతర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలకు వ్యతిరేకంగా దాడి చేయడంలో చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకులు యుగోస్లావ్ సమస్యకు ప్రత్యేక ప్రాముఖ్యత ఇస్తున్నారు. ప్రస్తుతం కమ్యూనిస్టు ఉద్యమంలోని చిక్కులన్నీ యుగోస్లావియాతో సంబంధాలను బాగుచేసుకోడానికి సోవియట్ యూనియన్ ప్రయత్నించడం వల్లనే వచ్చాయన్నట్లుగా చిత్రించుతున్నారు. యుగోస్లావియా సోషలిస్టుదేశం కాదని నిరూపించడానికి కూడ తీవ్రంగా ప్రయత్నించుతున్నారు.

ప్రధానంగా స్టాలిన్ నేరంవల్ల, యుగోస్లావియాతో వచ్చిన దీర్ఘ కాల తగాదాను అధిగమించడానికి ఇతర సోదర పార్టీలతో కలసి 1955లో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కృషి చేసిందని అందరికీ తెలిసిన విషయమే. ఆ సమయంలో యుగోస్లావియాలోని సోషలిస్టు విధానం గురించి చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులకు ఎలాంటి సందేహాలు కలుగలేదు. అందు

చేతనే జెన్మిన్ జిపావో పత్రిక 'సోషలిజం నిర్మాణంలో యుగోస్లావియా యిప్పటికే ముఖ్య విజయాలను సాధించిందని' వ్యాఖ్యానించింది.

యుగోస్లావియాలోని సామాజిక-ఆర్థిక క్రమాన్ని గురించి వాస్తవిక దృష్టితో పరిశీలించితే తదనంతర సంవత్సరాలలో సోషలిస్టు విధానం మరింతగా బలపడిందని తెలుస్తుంది. 1958 లో యుగోస్లావియా పరిశ్రమల్లో 100 శాతం, వ్యవసాయంలో 6 శాతం, వర్తకంలో 9: శాతం సోషలిస్టు సెక్టరుగా వుండేది. ఇపుడు పరిశ్రమల్లో 100 శాతం, వ్యవసాయంలో 15 శాతం, వర్తకంలో 100 శాతం సోషలిస్టు సెక్టరుగా వుంది. దౌత్యసంబంధాలు మెరుగైన తర్వాతదశలో సోవియట్ యూనియన్ తదితర సోషలిస్టు దేశాలతో విదేశాంగవిధాన సమస్యల్లో యుగోస్లావియా వైఖరి చేరువవుతూ వచ్చింది.

అలాంటపుడు చైనా పార్టీ నాయకులు యుగోస్లావియా సమస్య విషయమై ఎందుకంత తీవ్రంగా తమ వైఖరిని మార్చుకున్నారు? ఈ ప్రశ్నకు సమాధాన మివ్వడం చాల కష్టం; సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఇతర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల విధానాలను తూర్పారపట్టడానికిఆసమస్య మంచి సాకుగా వినియోగపడుతుందని వారాశించుతున్నారని తప్పితే.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీకి యుగోస్లావియా కమ్యూనిస్టుల లీగ్‌కు మధ్య అనేక ముఖ్య సిద్ధాంత సమస్యల్లో విభేదా లున్నాయని సోవియట్ కమ్యూనిస్టులు ఎరుగుదురు. దీన్నిగురించి బహిరంగంగా యుగోస్లావ్ నాయకులతో యిదివరకు చెప్పాము, ఇపుడూ చెబుతున్నాము. కాని ఈ ప్రాతిపదికపై సోషలిజాన్నుంచి యుగోస్లావియాను 'వెలివేయడం' తప్పు. చైనా నాయకులు చేస్తున్నట్లుగా సోషలిస్టు దేశాలనుండి యుగోస్లావియాను వేరుచేసి దూరంగా తరమడం, సామ్రాజ్యవాదుల శిబిరంలోకి నెట్టడం పొరపాటవుతుంది. అచ్చంగా యిదే జరగాలని సామ్రాజ్యవాదులు కోరుకుంటారు.

ప్రపంచంలో ప్రస్తుతం 14 సోషలిస్టు దేశాలున్నాయి. సమీప భవిష్యత్తులోనే ఈ సంఖ్య బాగా పెరుగుతుందని మనం పూర్తిగా విశ్వసించుతున్నాం. ప్రభుత్వాధికారం నడుపుతున్న సోదర పార్టీలు యెదుర్కొంటున్న సమస్యలు పెరుగుతున్నాయి. అంతేగాక, ప్రతి సోదరపార్టీ విభిన్న పరిస్థితులలో పని చేస్తున్నది.

ఈ పరిస్థితులన్నిటివల్లా సోదరపార్టీలు ఒక్కొక్క సమస్యా పరిష్కారం యెడల వేర్వేరు దృక్పథాలను కలిగివుండడంలో ఆశ్చర్యం లేదు. ఇలాంటి సందర్భంలో మార్క్సిస్టు-లెనినిస్టులు ఎలా ప్రవర్తించాలి? ఏదో ఒక సోషలిస్టు దేశనాయకులు తమతో ఏకీభవించనంతమాత్రాన, ఆ దేశం యింక సోషలిస్టు దేశమే కాదని ప్రకటించుతామా? అలా చేయడం నిజంగా నిరంకుశత్వ మనిపించుకొంటుంది. మార్క్సిజం-లెనినిజానితో ఆ పద్ధతికి ఎలాంటి సంబంధమూ లేదు.

చైనా నాయకుల ఉదాహరణనే మేమూ అనుసరించినట్లయితే చాలాకాలం క్రిందటే అల్బేనియాను, అల్బేనియా కార్మికపార్టీ నాయకులతో మనకు తీవ్రమైన భేదాభిప్రాయాలున్నందువల్ల, అది సోషలిస్టు దేశం కాదని ప్రకటించి వుండేవాళ్ళం. కాని ఇది తప్పుడు, స్వీయాత్మక ధోరణి అవుతుంది. అల్బేనియా నాయకులతో విభేదాలు వున్నప్పటికీ సోవియట్ కమ్యూనిస్టులు అల్బేనియాను సోషలిస్టు దేశంగానే పరిగణించుతున్నారు. సోషలిస్టు కుటుంబంనుండి అల్బేనియాను వేరుగాకుండా ఆపుచేయడానికి మనవైపునుంచి అన్ని విధాల కృషిచేస్తాం.

సాంప్రదాయకంగా వస్తున్న సోవియట్-చైనా మైత్రిని చైనా కమ్యూనిస్టు నాయకులు భగ్నం చేస్తున్నందుకు, సోషలిస్టు దేశాల ఐకమత్యాన్ని బలహీన పరుస్తున్నందుకు విచారపడుతున్నాం.

సోషలిస్టు దేశాల, యావత్తు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమ ఐకమత్యాన్ని పెంపొందించేటందుకు సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కృషిచేసోంది, కృషి చేస్తుంది.

## 6

మనం తిరిగి జ్ఞాపకం తెచ్చుకుందాం: 1960మాస్కో ప్రకటనలు ఆమోదించినప్పటినుండీ, ప్రపంచ కమ్యూనిస్టు, కార్మిక ఉద్యమం యొక్క కార్యక్రమం సరైనదేనని పూర్తిగా ఋజువైంది. కమ్యూనిజం నిర్మాణంలో సోవియట్ యూనియన్ విజయాలూ, ఇతర సోషలిస్టు దేశాల్లో సోషలిస్టు నిర్మాణంయొక్క విజయాలూ, ప్రపంచమంతటా ప్రజల మనసులపై మరింత విప్లవాత్మక ప్రభావాన్ని కలిగిస్తాయి. విప్లవ క్యూబా, పాశ్చాత్య భూఖండంలో సోషలిజం జ్యోతిని వెల్గించింది. వలస వ్యవస్థకు నిర్ణయాత్మకమైన దెబ్బలు తగిలాయి. వలసవ్యవస్థ పూర్తిగా నిర్మూలనమయ్యే స్థితి

వచ్చింది. సామ్రాజ్యవాద దేశాల్లో కార్మికవర్గం నూతన విజయాలను సాధించింది ప్రపంచ విప్లవోద్యమం అప్రతిహతంగా పురోగమిస్తున్నది.

దీనంతటినీబట్టి, 1960 మాస్కో ప్రకటన ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి సరైన సాధారణ విధానాన్ని రూపొందించిందని నిరూపణ అయింది. ఈ సాధారణ విధానానికి అనుగుణ్యంగా పనిచేయడం ఇప్పటి కర్తవ్యం; వివిధ కమ్యూనిస్టు పార్టీలు ఏయేపరిస్థితులలో పనిచేస్తున్నాయో వాటి కనుగుణంగా ఈ సాధారణ విధానాన్ని సమన్వయించి, అభివృద్ధి చేయటమూ, నిర్దిష్టంగా పెంపొందించటమూ. ఇప్పటి కర్తవ్యం. అందువలన చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ తన జూన్ 14 లేఖలో చేసి నట్లుగా, ప్రపంచ కమ్యూనిస్టు, కార్మికవర్గ ఉద్యమంపై కొత్త సాధారణ విధానాన్ని రుద్దేటందుకు జరిగే సకల ప్రయత్నాలూ దివాళాకోరువీ, హాని కరమూను. ఈ కొత్త సాధారణ విధానాన్ని ఆమోదించడమంటే, 1960 ప్రకటనకు దూరం కావడమన్న మాట; 81 పార్టీలు ఆమోదించిన ఈ ప్రకటనకు విరుద్ధంగా ఒక కార్యక్రమ ప్రతిపాదనలను ఆమోదించడ మన్నమాట. మన పార్టీ ఈ పని చేయదు.

మన దేశంలో, అంతర్జాతీయ రంగంలో నానారూపాలలో మితవాద, అతివాద అవకాశ వాదములతోనూ, ట్రాట్స్కీ వాదమూ, రివిజనిజంలతోనూ, పిడివాదం, ఒంటెత్తు పోకడలతోనూ సంకుచిత జాతీయవాదమూ, జాతీయదురహంకారములతోనూ మన ఘనమైన లెనినిస్టు పార్టీ తన యావత్తు చరిత్ర అంతంతటా రాజీలేని పోరాటం సల్పింది. మార్క్సిజం-లెనినిజం పవిత్రతకోసం సాగిన పోరాటంలో మన పార్టీ నిగ్గు దేలింది. తరువాత తరువాత వచ్చిన విచ్ఛిన్నకులూ, అవకాశవాదులు, ఏ కోవకు చెందినప్పటికీ, వారు చేసే దాడులకు మన పార్టీ భయపడదు.

యావత్తు ప్రజల రాజకీయసంస్థగా రూపొందిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, ప్రజాబాహుళ్యంతో తన సంబంధాలను దృఢతరం చేసుకున్న దనీ, మరింత శక్తివంతంగా తయారైనదనీ, ఇంకా మరింత గట్టి క్రమ శిక్షణ కల్గివుంటనీ జీవితం నిరూపిస్తోంది. సోషలిజం విజయంతో, కార్మిక వర్గం యొక్క సిద్ధాంతమైన మార్క్సిజం-లెనినిజం, యావత్తు ప్రజల, ప్రజానీకంలో అభ్యుదయకర శక్తుల యొక్క సిద్ధాంతమైంది. కార్మికవర్గం యొక్క ధ్యేయమైన కమ్యూనిజం నిర్మాణం, సకల ప్రజల ధ్యేయమైంది.

కమ్యూనిస్టు సిద్ధాంతానికి పలుకుబడి పెరిగినందుకు మార్క్సిస్టు లెనినిస్టులు సంతోషిస్తారు. లెనిన్ అస్తమయంతర్వాత, నూతనప్రపంచనిర్మాణానికిసంబంధించిన అత్యంత సాహస కర్తవ్యాలను ఇప్పుడు సాధించగలిగినంత సమర్థవంతంగానూ, ఇప్పుడున్నంత బలంగానూ మన పార్టీ ఇదివరకెన్నడూలేదు.

మన దేశంలో సోషలిజం పూర్తిగా అంతిమంగా విజయాన్ని సాధించింది. మనం, సుందరమైన కమ్యూనిజాన్ని క్రమక్రమంగా నిర్మిస్తున్నాం. మన పార్టీ యావత్తు సోవియట్ ప్రజలూ, ఇప్పుడు మార్క్సిజం-లెనినిజంయొక్క మహత్తర భావాలు ప్రపంచమంతటా విజయం పొందుతాయని మరింత గట్టిగా విశ్వసిస్తున్నారు.

మన విశ్వాసమే సోషలిస్టుదేశాల ప్రజలకూ, ప్రపంచ శ్రామికప్రజలకూ ఉన్నది. శాంతీ, ప్రజాస్వామికమూ, జాతీయ స్వాతంత్ర్యమూ, స్వేచ్ఛ, సోషలిజమూ-వీటిని సాధించవలనే మహత్తర ఆశయానికి సోవియట్ యూనియన్ చేసిన ఘనమైన తోడ్పాటును వారు బాగాప్రశంసిస్తున్నారు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, చైనా కమ్యూనిస్టుపార్టీతో సన్నిహిత మైత్రికోసం గతంలోనూ నిలబడింది. ఇప్పుడూ నిలబడుతోంది. మనకూ, చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులకూ తీవ్రమైన విభేదాలున్నాయి. కాని, నూతన కమ్యూనిస్టు సమాజం నిర్మించాలనేదే మన ఇద్దరి ధ్యేయం; మనిద్దరి శత్రువూ సామ్రాజ్యవాదమే; ఈ వాస్తవం ప్రాతిపదికపై ఈ రెండుపార్టీల సంబంధాను, మన ఉభయదేశాల సంబంధాలను పెంపొందించాలని మేం కాంక్షిస్తున్నాం. సోవియట్ యూనియన్, చైనా ప్రజారిపబ్లిక్ ఈ రెండూ మహత్తరదేశాలు. కమ్యూనిజంవిజయానికి తమసంయుక్తకృషిద్వారాబాగా తోడ్పడగలవు మన మిత్రులకూ, శత్రువులకూ ఈ విషయం బాగాతెలుసు.

సోవియట్, చైనా కమ్యూనిస్టుపార్టీల ప్రతినిధివర్గాల సమావేశం ప్రస్తుతం మాస్కోలో జరుగుతున్నది. దురదృష్టవశాత్తు, చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధులు సమావేశంలో పరిస్థితిని తీవ్రం చేయడం కొనసాగిస్తున్నారు. అయినప్పటికీ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం ఎంతో సహనాన్ని,నిగ్రహాన్ని ప్రదర్శిస్తున్నది; సంప్రతింపులు జయప్రదం అయ్యేందుకు ఒత్తిడి చేస్తున్నది. మన ఉభయులనూ వేరుచేసే అంశంపైగాక, ఐక్యంచేసే అంశం ప్రాతిపదికపైనా, మార్క్సిజం-లెనినిజం సూత్రాల ప్రాతిపదికపైనా, మన సంబంధాలను పెంపొందించుకోవడానికి చైనా కామ్రేడ్స్ అంగీకరిస్తారో, లేదో అన్నది సమీప భవిష్యత్తునిరూపిస్తుంది.

సోవియట్, చైనా కమ్యూనిస్టు పార్టీల మధ్యనున్న వైరుధ్యాలు పెరుగుతాయని మన శత్రువులు తమ అంచనాలు వేస్తున్నారు. వారు తమ కనుకూలమయిన దానికోసం యిప్పుడు చూస్తున్నారు. అమెరికా పత్రిక "డెయిలీ న్యూస్" ఇటీవల యిలా వ్రాసింది: "మనం కమ్యూనిస్టు రష్యాను, కమ్యూనిస్టు చైనాను ఒక దానిపై మరొక దాన్ని ఉసికొల్పు దాం. తత్ఫలితంగా అవి ఒక దాన్ని మరొకటి ముక్కముక్కలు చేసు కుంటాయి." కమ్యూనిస్టులమైన మనం ఈ సామ్రాజ్యవాదుల మోసపు పన్నాగాలను ఎన్నడూ మరవరారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమమూ, ప్రపంచ ప్రజలపట్ల తన బాధ్యతను సోవియట్ పార్టీ గుర్తించింది. అందువలన విభేదాలను పరిష్క రించే మార్గాన్ని చేబట్టవలసిందిగాను, మార్క్సిజం-లెనినిజమూ, కార్మిక వర్గ అంతర్జాతీయతా సూత్రాలపై నిజమైన ఐక్యతను బలవత్తరంచేసే మార్గాన్ని చేబట్టవలసిందిగానూ, మన పార్టీ చైనా కామ్రేడ్స్‌ను కోరుతోంది.

కార్మికవర్గమూ, సకలశ్రామిక ప్రజల ఐక్యతకోసమూ, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగానూ, శాంతీ, ప్రజాస్వామ్యమూ, జాతీయ స్వాతం త్ర్యమూ, సోషలిజం కోసం మన లెనినిస్టుపార్టీ, తదితర సోదరపార్టీలతో కలిసి పోరాడింది, పోరాడుతోంది.

పార్టీకి, యావత్తు సోవియట్ ప్రజలకూ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ఎంతో బాధ్యతతో ఇలా ప్రకటిస్తున్నది: చైనా కమ్యూ నిస్టు పార్టీతో ఐక్యతను బలవత్తరం చేయడానికి మేము శాయశక్తులా ప్రయత్నించాం, ఇకముందూ ప్రయత్నిస్తాం. లెనిన్ పతాకక్రిందకు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని సమీకృతం చేస్తాం; వలస విధానానికి వ్యతిరేకంగా పోరాడుతూన్న ప్రజలందరకూ ఫలవంతమైన సహాయాన్ని అందించుటకు సోషలిజం ప్రపంచవ్యవస్థకు చెందిన దేశాలను సమీకృతం చేస్తాం. శాంతి ఆశయాన్ని దృఢపర్చుతాం. కమ్యూనిజం యొక్క మహత్తర భావాలు ప్రపంచమందంతటా విజయం పొందేటందుకు కృషిచేస్తాం.

సోవియట్ యూనియన్‌లోని శ్రామిక ప్రజలందరూ తమ కమ్యూ నిస్టు పార్టీ లెనినిస్టు కేంద్రకమిటీ వెనుక మరింత సన్నిహితంగా సమీకృతు లవుతారు. కమ్యూనిజాన్ని నిర్మించే మహత్తర కార్యక్రమాన్ని సాధించ డానికి వారు తమ శక్తినంతటినీ అంకితం చేస్తారు.

సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA112B215 |
| పుస్తకం పేరు | సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ బహిరంగ లేఖ |
| తారీఖు | 11 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | akshaya |
| స్కాన్ చేసినది | Apsar |
| పరీక్ష చేసినది | nandini |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |